Regd. No. H.N.L. 18

11-6-1993 శుక్రవారం 12 పేజీలు సంపుటి : 64 సంచిక 24 వెల : రు. 2.00 లు

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు

# వైఎస్‌తో కోట్ల రాజీ

ముందుగా ప్రకటించినట్లే ప్రాంతీయ పార్టీ ఏర్పాటుకు డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి గుడ్ బై చెప్పారు. కొత్తగా ప్రాంతీయ పార్టీ ఏర్పాటు ప్రతిపాదన ద్వారా ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డి పై ఒత్తిడి తేవాలన్న లక్ష్యం నెరవేరడంతో ప్రాంతీయ పార్టీ ఏర్పాటు ఉత్తుత్తిదే అని వై.ఎస్. ప్రకటించారు. వై.ఎస్. సారథ్యంలో ప్రాంతీయ పార్టీ ఏర్పాటు కానున్న వార్తలు బయటకి పొక్కడంతోనే ముఖ్యమంత్రి కంగారు పడ్డారు. వై.ఎస్. ప్రాంతీయ పార్టీ బోగస్ అని స్పష్టంగా ముఖ్యమంత్రికి తెలిసినప్పటికీ పార్టీలో ఈ విధమైన పోకడ మంచిది కాదని ఆయన వై.ఎస్.తో రాజకీయ సర్దుబాటు చేసుకోవడంతో ప్రాంతీయ పార్టీ ప్రతిపాదనకు తెరపడింది. వై.ఎస్.కు సన్నిహితుడైన రాజ్యసభ సభ్యుడు ద్రోణంరాజు సత్యనారాయణ ద్వారా ముఖ్యమంత్రి సంధి రాయబారం జరిపించారు. వై.ఎస్. కోరుతున్న మంత్రి పదవుల పంపకానికి ముఖ్యమంత్రి దాదాపు అంగీకరించారని అంటున్నారు. అయితే వై.ఎస్. వర్గీయుల్లో ఫలానా వారికి అనకుండా తన ఇష్టమొచ్చిన వారికి మంత్రి పదవులు ఇస్తానని కోట్ల వారు హామీ ఇచ్చారు. వై.ఎస్. వార్త కోసం కాకుండా కాస్తంత అటు ఇటుగా వుంటే వారికి మంత్రిత్వం కట్టబెట్టాలన్నది కోట్ల వారి అంతర్యం కావచ్చు. వై.ఎస్.కు సన్నిహితుడైన డాక్టర్ శివరామకృష్ణ హోంమంత్రి మైసూరా రెడ్డి పట్ల కూడా అభిమానంగా వుంటున్నందు వల్ల కడప జిల్లా నుంచి శివరామకృష్ణకు మంత్రి పదవి దాదాపు ఖరారైందని అంటున్నారు. అలాగే మాజీ మంత్రులు ముద్రగడ పద్మనాభంను కానీ, సంగీత వెంకట రెడ్డి ని కాని వై.ఎస్. కోటాలో క్యాబినెట్లో చేర్చుకోవచ్చు. మాజీ మంత్రి లక్ష్మీదేవిని కూడా వై.ఎస్. కోటా కిందనే పరిగణించి మంత్రిత్వం అప్పజెప్పే అవకాశం వుంది.

కొరవ-11 వ పేజీలో

### ఎన్టీఆర్ అక్రమ సంబంధపు వదంతితో

# దేశం పరువుకు సమాధి!

నిన్నటి దాకా రాజకీయ నాయకుల అవినీతి పత్రికల పతాక శీర్షికల కెక్కితే, ఇప్పుడు రాజకీయ వాదుల వ్యక్తిగత విషయాలు, తెర వెనుక భాగోతాలు ఎంచక్కా హెడ్‌లైన్స్ అలరిస్తున్నాయి. ''నువ్వొకటంటే నే రెండంటా'' అన్న ధోరణిలో రాజకీయ నాయకులు పరస్పర శీలహననంతో దుమ్మెత్తి పోసుకుంటున్నారు. లక్ష్మీ శివ పార్వతి అనే పెళ్లయిన యువతితో తెలుగుదేశం అధ్యక్షుడు ఎన్టీఆర్ మానసిక సాన్నిహిత్యం కలిగి వున్నారని, ఆమె భర్తకు విడాకులిచ్చి ఏకంగా ఎన్టీఆర్ ఇంట్లోనే ఉంటోందన్న ఆరోపణలు పత్రికల్లో పతాక శీర్షికల్లో చోటుచేసుకున్నాయి. దీంతో కొందరు కాంగ్రెస్ నాయకులు ఎగిరి గంతేసి పత్రికా ప్రకటనలతో ఎన్టీఆర్ పై మరింత బురద చల్లారు. ముఖ్యమంత్రి సొంత జిల్లా అయిన కర్నూలు ఎమ్మెల్యేలు మొదట ఎన్టీఆర్ వ్యక్తిగత జీవితం పై ప్రకటన గుప్పించటంతో తెలుగుదేశం నాయకులకు ఒళ్లు మండింది. కర్నూలు జిల్లా ఎమ్మెల్యేల ప్రకటన వెనుక ముఖ్యమంత్రి కుమారుడు ప్రకాష్ రెడ్డి హస్తం వుందని అనుమానించిన తెలుగుదేశం నాయకులు

కొరవ 11 వ పేజీలో

# విస్తరణకు గ్రీన్ సిగ్నల్ రాలేదు!

రాష్ట్ర మంత్రివర్గ విస్తరణకు మరికొంత సమయం పట్టవచ్చు. ఇటీవల ముఖ్యమంత్రి ఢిల్లీ పర్యటనలో విస్తరణకు గ్రీన్ సిగ్నల్ తెస్తారనిభావించారు. అయితే ప్రధాని పి.వి. అనారోగ్య కారణంగా విస్తరణ ఊసెత్తలేక పోయారట. వచ్చేవారం ముఖ్యమంత్రి తిరిగి ఢిల్లీ వెళ్తున్నారు. ఈసారి ఖచ్చితంగా విస్తరణ విషయం తేలుస్తారని భావిస్తున్నారు.

### ద్రోణం బహుపాత్రాభినయం

రాష్ట్ర రాజకీయాల్లో ద్రోణంరాజు బహుపాత్రాభినయం చేసి రక్తి కట్టిస్తున్నారు. వై.ఎస్. ఇంట్లో జరిగిన ప్రాంతీయ పార్టీ ఏర్పాటు గోష్టిలో ద్రోణం పాల్గొన్నారు. అలాగే పిసిసి ఉద్యమం లేవదీస్తానంటోన్న కె.ఐ. కృష్ణమూర్తితో ద్రోణం సాన్నిహిత్యం ఈ మధ్య మరీ పెరిగింది. పిసిసి అధ్యక్షుడు మత్తి తులసీదాస్ వ్యతిరేక లాబీకి ద్రోణంరాజు నాయకుడు. కాగా ముఖ్యమంత్రితో కూడా ద్రోణం

**రాజధాని రాజకీయం**

సన్నిహితంగా వుంటూనే ఆయన వ్యతిరేకుల వద్దకు దూతగా వెళ్తున్నారు. మొత్తం మీద అటు ఇటు ద్రోణం వారి నవరసాభినయనం చూడముచ్చటగా వుంటున్నది. ద్రోణం పాత్ర ఏమిటో అర్థం కాక జుత్తు పీక్కోవటం విలేఖరుల వంతైంది

## జిల్లావార్తలు

# ఉదయగిరిలో గల్ఫ్ టోపి

కువైట్, దుబాయ్ భూతల స్వర్గం బాయ్! రెండు సంవత్సరాలు వుండి వస్తే లక్షాధికారులై పోతారు. ముందు పాస్ పోర్టుకు వెయ్యి రూపాయలిస్తేచాలని ఉదయగిరి పల్లెల్లో ప్రజలను నకిలీ ఏజెంట్లు మోసగిస్తున్నారని ఆలజడిగా వుంది. సందిపాడు, నందవరం, అల్లంపాడు, బిజ్జమ్ పల్లి, సీతారాం పురం గ్రామాల్లో టిప్‌టాప్‌గా ఏజెంట్లమని అపరిచితులైన వ్యక్తులు కొందరు ఈ వ్యాపారాన్ని ప్రారంభించారు. ఇప్పటికే ఈ ప్రాంత ప్రజలు పలువురు కువైట్, దుబాయ్, సౌదీ అరేబియాలకు పోయి వుండడం వల్ల ప్రజలను ఈ వ్యాపారం ఆకట్టుకుంటున్నది. పాస్‌పోర్టుకే పెట్టుబడి పెట్టండి. వీసా డబ్బులు కట్టనక్కర్లేదు. వుద్యోగంలో చేరాక వీసా డబ్బుల సంగతి చూస్తామంటున్నారు. కొందరైతే రెండింటికీకలిపి 20 వేలకు పైగా గుంజుకొంటున్నారు. ఈ ప్రాంతంలో ఇటీవల కొందరు మహిళలను బొంబాయి తీసుకెళ్లి వ్యభిచారపు వూబిలో దించేందుకు ప్రయత్నించగా తెలివిగా తప్పించుకొన్నట్లు తెలుస్తున్నది.

### ఉద్యోగాలఆశచూపి దోపిడీ చేస్తున్నారు

గ్రామంలో ఎవరో ఒక పెద్ద మనిషిని చూసుకొని అతన్ని పలు విధాలుగా సంతృప్తి పరచి తమ వ్యాపారానికి అతన్ని పావుగా వాడుకొంటున్నారు. ఆ తరువాత అతనూ తనకేమీ తెలియదని మామూలు ప్రేక్షకుడిగా మిగిలి పోతున్నారు. ఇటీవల ఈ ప్రాంతంలో చాలా మంది నుంచి వెయ్యేసి రూపాయల వంతున వసూలు చేసుకొని, భారీ మొత్తంతో ఒక వ్యక్తి పరారయ్యాడట. ఏ ఒక్కరూ ఈ మోసాన్ని గూర్చి పట్టించుకోక పోవడం వల్ల పాపం పడమటి పల్లెలోని ప్రజలు గల్ఫ్ మోజులో పడి అన్యాయంగా బలై పోతున్నారు.

### గూడూరు రెవిన్యూ అసోసియేషన్

గూడూరు డివిజన్ నాల్గవ తరగతి రెవిన్యూ వుద్యోగుల సంఘం అధ్యక్షునిగా సి.హెచ్. రమణయ్య, కార్యదర్శిగా సి.హెచ్. రంగయ్య, కోశాధికారిగా పి. సుధాకర్ ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. వి. లక్ష్మణరావు ఎన్నికల అధికారి బాధ్యతలు నిర్వహించారు.

# నక్కల కాల్వ రైతుల లబోదిబో

వెంకటాచలం - ముత్తుకూరు మండలాలను తాకుతూ వెళ్లేనక్కలకాల్వ అభివృద్ధి పనులంటూ తమ భూములను ఆక్రమించుకొంటున్న ప్రభుత్వ అధికార్ల తీరును రైతులు దుయ్యబడుతున్నారు. రైతులకునోటీసులు ఇవ్వకుండానే భూమి ఎంత పోతుందో తెలుపకుండానే పనులు మొదలు పెట్టేసారట. ఆక్రమించుకొంటామని చెప్పిన భూములను మోతాదుకు మించి ఆక్రమించేశారని గూర్లూరు వారి పాళెం రైతుల గోడు. సర్వే జరపకుండా, నష్టపరిహారం చెల్లించకుండా, అధికార దర్పం ప్రదర్శిస్తున్న అధికారులను కలెక్టర్‌గారే దారిలో పెట్టాలి.

### సిటిజెన్స్‌క్లబ్ వుచిత వైద్య శిబిరం

నెల్లూరు 'సిటిజన్స్ క్లబ్' కోవూరు మండలం పాటూరు గ్రామంలో ఒక వుచిత వైద్య శిబిరాన్ని 6 తేది

### చెప్పకుండానే భూముల స్వాధీనం

ఇటీవల కావలి క్లాత్ మర్చెంట్స్ అసోసియేషన్ హాల్‌లో జరిగిన కార్యక్రమంలో కోరిన రాగంలో, కోరిన తాళంలో, కోరిన విషయం పై అడగడమే తడువుగా గీత రచన చేసి శ్రావ్యంగా వినిపించి శ్రోతలను మంత్ర ముగ్ధులను చేసారు. ఆరు స్వచ్ఛంద సేవా సంస్థలు సంయుక్తంగా నిర్వహించిన ఈ వినూత్న కార్యక్రమానికి సభాధ్యక్షత టంగుటూరు రామకృష్ణ వహించారు. కేసరి సుందర రామ శర్మ, ఆర్. చంచల రావు, కె. నాగరాజ రావు, పి. వెంకటేశ్వర్లు, ఎస్. హరగోపాల్ ప్రభృతులు ప్రవ్రుకత్వం వహించారు. కొత్త ప్రక్రియ ప్రజలను అబ్బుర పరిచిందంటే అతిశయోక్తి కాదు.

# నిజాయితీకి మరోపేరు ఓరేపల్లి

నీతి, నిజాయితీకి మరో పేరుగా దివంగత జిల్లా ప్రజాపరిషత్ మాజీ ఛైర్మన్ శ్రీ ఓరేపల్లి వెంకట సుబ్బయ్యను చెప్పవచ్చునని మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్థన రెడ్డి ప్రస్తుతించారు. 2 తేది వెంకటగిరిలో జరిగిన ఓరేపల్లి సంతాపసభకు ఆయన ప్రధాన వక్తగా విచ్చేశారు. 12 సంవత్సరాలు నిరాటంకంగా ఎమ్మెల్యేగా కొనసాగాడంటే ఎంత సేవ చేసి వుంటాడో చెప్పనక్కర్లేదు. ప్రజాపరిషత్ ఛైర్మన్‌గా నిరాడంబర జీవితాన్ని నేటికీ కథలుగా చెప్పుకొంటారు. వెంకటగిరి సమితి, మార్కెటింగ్ కమిటీ అధ్యక్షునిగా ప్రజల మన్ననలు పొందిన తీరు ఎంత చెప్పినా తక్కువేనన్నారు జనార్థన రెడ్డి. సమాచార ప్రసార శాఖ మంత్రి శ్రీ పసల పెంచలయ్య అధ్యక్షత వహించిన ఈ సభలో శ్రీ యుతులు చెలికం శంకర రెడ్డి, పిల్లి పుల్లారెడ్డి, గూడూరు భాస్కర రెడ్డి, మాజీ శాసనసభ్యులు పాదిలేటి వెంకటస్వామి రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

### అలరించిన గేయధార

వెంకటగిరి మాజీ సంస్థానాధీశుడు డాక్టర్ వి.జి. సాయికృష్ణ యాచేంద్ర, కవిగా, రచయితగా అష్టావధానిగా గడించిన పేరుతో సంతృప్తి పడలేదు. తాజాగా గేయధార అనే సరికొత్త ప్రక్రియతో సాహిత్యాభిమానులతో పాటు సంగీతాభిమానుల హృదయాలనూ రసడోలికల్లో ముంచెత్తు తున్నారు.

నిర్వహించింది. 500 మందికి పైగా గ్రామస్తులకు వైద్య పరీక్షలు జరిపి ఆరు వేల రూపాయలకు పైగా విలువ చేసే మందులను పంచి పెట్టారు. శిబిరంలో ఇండియన్ మెడికల్ అసోసియేషన్ కార్యదర్శి జయచంద్ర, డాక్టర్ సత్యనాథ్, డాక్టర్ ప్రేమచంద్, డాక్టర్ రత్న పాల్గొన్నారు. శిబిరానికి ముఖ్య అతిథిగా సామంతుల రఘురామ రెడ్డి విచ్చేశారు. విమల్ శిల్క్‌హౌస్ సోరూం ఉదయ భాస్కర రావు, రఘురాం, క్లబ్ అధ్యక్షుడు జి. వెంకటేశ్వర్లు సేవా దృక్పథంతో శ్రమించి శిబిరాన్ని జయప్రద మొందించారు.

కొరవ 11 వ పేజిలో



# పెండ్లిండ్లు

పడమట పల్లెల వలస వాసుల సెటిల్‌మెంట్ కాలనీ అనదగిన ముత్తుకూరు రోడ్డు ధనలక్ష్మీపురం వాసి, తాపీ పనిలో చేయి తిరిగిన బేల్దారి మేస్త్రి కన్నేటి సుబ్బారెడ్డి కుమార్తె సుబ్బమ్మ; రెడ్డదిన్నె, మల్లెల సుబ్బారెడ్డి కుమారుడు సుబ్బారెడ్డి వివాహం 9 తేది స్వర్గీయ ఆడిటర్ దశరథరామ రెడ్డి నిర్మించిన కళ్యాణ మండపంలో జరిగింది.

* * *

ఆనం వారి రాజకీయ ప్రాభవపు రోజుల్లో వెయ్యి వాట్ల మెర్క్యురీ బల్బులా ఒక వెలుగు వెలిగి, ఆ తర్వాత ఆత్మకూరుకు పరిమితమై పోయి, రాజకీయాల రొంపి నుంచి బయట పడిన మంచి మిత్రుడు, మొహాన చిరునవ్వు చెరగని మందస్మితుడు, మాజీ శాసనసభ్యుడు శ్రీ కంచర్ల శ్రీహరి నాయుడు ఏకైక కుమారుడు రమణప్రసాద్; ఆత్మకూరు, డాక్టర్ సిహెచ్‌వి సుబ్బారావు కుమార్తె మాధవి కళ్యాణం 9 తేది కస్తూరి దేవి విద్యాలయంలో జరిగింది. రాజకీయాలు వదిలేసినా స్నేహితాలు కొనసాగుతూనే వున్నాయనడానికి గుర్తుగా వుండింది పెళ్లి పందిరిలో జన సందోహం.

* * *

బుచ్చి కాలేజి ఉద్యోగి, మంచి తనంతో, మృదు భాషణతో కొండంత స్నేహ సంపద సముపార్జించుకున్న అతి మంచి వాడు, వినయం, విధేయతలు పొరపాటున కూడా వదలి పెట్టని సంస్కారి శ్రీ ఇప్పగుంట కృష్ణారెడ్డి కుమారుడు శివకుమార్ రెడ్డి; నెల్లూరు బండారు బలరామి రెడ్డి కుమార్తె నీరజల వివాహం 12 తేది ఇందిరా భవన్‌లో జరిగింది.

* * *

సమాచార శాఖలో ఉద్యోగిగా జీవితం ప్రారంభించి ఆశాఖకే మంత్రిగా ఎదిగిన ప్రతిభాశాలి, పదవిలో వున్నా లేకున్నా నమ్మిన నాయకుడిని, పార్టీని మనసా వాచా ఆరాధించడంతో పాటు కష్టకాలంలో కూడా విశ్వాసం విధేయతలలో మార్పు చూపని నిలకడకల్గిన రాజకీయ వాది, ప్రత్యర్థి ఎంతటి వాడైనా రేసు గుర్రం వలె విరుచుక పడే ధైర్యశాలి, నోటితో ఎటువంటి పనైనా సాధించుకో గల్గిన సమర్థుడు, మంత్రిగా ఎదిగినా ఏ మాత్రం భేషజం, అధికార దర్పం ప్రదర్శించని నిరాడంబరుడు శ్రీ పసల పెంచలయ్య కుమార్తె విద్యావతి, అభ్యుదయ భావాలు పుణికి పుచ్చుకున్న

కొరవ 11 వ పేజిలో

# జమీన్‌రైతు

## సోమయజ్ఞ ప్రహసనం

ఆధ్యాత్మిక అణుబాంబు పలి వున్న అయోధ్యలో నిప్పురాజేసి, మరొకసారి విస్ఫోటనం సృష్టించడానికి చంద్రస్వామి చేసిన సోమయజ్ఞం విఫలం కావడం సంతోష దాయకం. ధీరేంద్ర బ్రహ్మచారి తర్వాత అంతటి స్థాయికి ఎదిగిన రాజకీయ సాధువు చంద్రస్వామి. అతడు చేసే ఆధ్యాత్మిక ప్రబోధనలేమిటో తెలియదు కాని, అతడు చేసిన 'అక్రమ కార్యక్రమాలు మాత్రం ప్రపంచానికి బాగా తెలుసు. పేరుపొందిన అంతర్జాతీయ ఆయుధ స్మగ్లరు ఖషోగి నుంచి మన పివి నరసింహా రావు వరకు అతడి కున్న శిష్య బృందం అపారం. ఎందరో ఢిల్లీ నేతలు చంద్రస్వామి అడుగులకు మడుగు లొత్తుతారని ప్రతీతి. మాజీ ప్రధాని చంద్రశేఖర్ కూడా చంద్రస్వామి భక్త పరమాణువే!

అయోధ్య వ్యవహారాల ఫలితంగా క్షీణించిన కాంగ్రెస్ ప్రతిష్ఠను పెంపొందించి, దూరమై పోయిన హిందూ ఓట్లను తిరిగి పొందడానికి పివి నరసింహా రావు గారు చంద్రస్వామి సహాయం అర్థించినట్లున్నారు. అదీగాక దేశంలో హిందువులకు విశ్వహిందూ పరిషత్ ఏకైక ప్రతినిధిగా గుర్తింపబడడమూ చంద్రస్వామికి కష్టంగా వుంది! ఈ రెండు ఉద్దేశ్యాలు మనసులో పెట్టుకొని సోమయాగం తలపెట్టారు. రెండు లక్షల మంది భక్తులను, పదివేల మంది సాధువులను సమీకరించాలని సంకల్పించారు. కోట్లు ఖర్చు పెట్టి ఆర్భాటంగా ఏర్పాట్లు చేశారు. పివి మద్దతు వుండడంతో ఏకంగా వివాదస్పద రామ్‌లాల విగ్రహాల ప్రక్కనే యజ్ఞ వేదికను ఏర్పాటు చేశారు. ఈ తంతు వల్ల మతోద్రేకాలు చెలరేగే ప్రమాదం వుంది కాబట్టి అనుమతి ఇవ్వలేమని చెప్పిన ఫైజాబాద్ కలెక్టర్‌ను క్షణాల పై బదలీ చేయించారు. ఇంత చేసినా సోమయజ్ఞం ప్రజల నాకర్షించలేదు. వెయ్యి మంది కూడా యజ్ఞ నిర్వహణను చూడను రాలేదు. అవమాన భారంతో యాగాన్ని సగంలోనే ముగించి, పలాయనం చిత్తగించ వలసి వచ్చింది; పాపం చంద్రస్వామి! పై పెచ్చు, అయోధ్యలో రామాలయం ఇప్పుడున్న చోటనే నిర్మించాలని, బాబ్రీ మసీదును ముస్లింలు మర్చిపోవాలని ప్రకటించి ప్రధానిని ఇరకాటంలో పెట్టాడు. కాంగ్రెస్ ప్రతిష్ఠ పెంచడానికి చేసిన ఈ ప్రయత్నం పార్టీ పరువును మరింత దిగతుడిచి వేసింది!

అయోధ్య విషయంలో కేంద్ర ప్రభుత్వం ఇంకా పొరపాట్లు చేయడం శోచనీయం. జరిగిన నష్టం జరిగిపోయింది. దాన్ని పూడ్చుకోవడానికి మరిన్ని తప్పులు చేయడం ఆత్మహత్యా సదృశ్యమౌతుంది.

## సెక్యులర్ ఫ్రంట్

రానున్న పార్లమెంటు ఎన్నికలలో ఉత్తరాదిన కాంగ్రెస్ గెలుపు అసాధ్యమన్న దృఢాభిప్రాయంతో జనతాదళ్ నాయకులు ఐక్యతా ప్రయత్నాలు ప్రారంభించారు. 1989 ఎన్నికల తర్వాత తగువులు, తంటాలతో విడిపోయిన విపిసింగ్, అజిత్‌సింగ్, దేవీలాల్ లను తిరిగి ఒకే త్రాటి మీద నడిపించడానికి బిజూపట్నాయక్, రామకృష్ణ హెగ్డే కృషి చేస్తున్నారు. అయోధ్య దుర్ఘటనలతో మైనారిటీలు కాంగ్రెస్‌కు దూరమైపోయారు; హిందువులు బిజెపికి దగ్గరైనారు. బిజెపిని ఎన్నికలలో ఎదిరించి నిలబడగల సత్తా బీహార్‌లో లల్లూ ప్రసాద్ యాదవ్‌కు, ఉత్తరప్రదేశ్‌లో ములాయం సింగ్ యాదవ్‌కు మాత్రమే వుందని ఇటీవల జరిగిన ఉపఎన్నికలు రుజువు చేశాయి. ఈ నేపథ్యంలో జనతా నాయకులందరూ కలిసి సమష్టి పోరు సల్పితే బిజెపి, కాంగ్రెస్‌లను ఓడించి అధికారం చేజిక్కించుకోవచ్చు నన్నది వారి ఆశ.

అయితే జనతా పార్టీ నాయకులకు ప్రజలు ఇప్పటికే రెండు సార్లు అవకాశ మిచ్చి చూశారు. రెండు సార్లు అది నిరుపయోగమైంది. గిల్లికజ్జాలతో అధికార పీఠాన్ని చిందర వందర చేసి, పదవీ పోట్లాటతో పరిపాలనను కుక్క చింపిన విస్తరి చేసే తత్వం కల్గిన ఈ నాయకులను ప్రజలు మరొక సారి విశ్వసిస్తారా అన్నది సందేహం

బిజెపిని ప్రతిఘటించడానికి ఉమ్మడి పోరు సల్పడం మాత్రం జాతి ప్రయోజనాల దృష్ట్యా అత్యవసరం. మతోన్మాదం పునాదులుగా పరిపాలన సాగించాలనే బిజెపి అధికారం లోకి వస్తే దేశం మత మారణ హోమపు జ్వాలల్లో మాడి మసైపోతుంది. కేవలం విపిసింగ్, దేవీలాల్, అజిత్ సింగ్‌లు ఏకమైతే ఏ ప్రయోజనమూ నెరవేరదు. ఉత్తరాదిన బిజెపి పట్ల ప్రజలలో పెరుగుతున్న ఆదరణ చూస్తే భయంగా కల్గుతున్నది. విడివిడి నాయకులు, పార్టీలుగా కాకుండా లౌకికవాదం పట్ల విశ్వాసం వున్న రాజకీయ పార్టీలన్నీ ఏకమై ఒక సెక్యులర్ ఫ్రంట్‌గా అవతరించ గల్గితే బిజెపి ప్రమాదాన్ని నివారించవచ్చు. జనతా ముక్కలతో పాటు, కాంగ్రెస్, సిపిఎం, సిపిఐలు సైతం ఈ ఫ్రంట్‌లో భాగస్వాములై జాతీయవాద కూటమిగా ఏర్పడి, ఎన్నికలలో పోరాటం జరపడం మినహా మరొక గత్యంతరం లేదు. సలహా చెప్పడానికి సులభమే కాని ఇటువంటి ఫ్రంట్ ఆవిర్భావం ఆచరణలో సాధ్యమా అన్నది సందేహం. అసాధ్యమైన ఆ కార్యాన్ని సుసాధ్యం చేయడానికి ఇప్పటి నుంచే ప్రయత్నం ప్రారంభించ గల్గితే దేశం బాగుపడుతుంది.

# జమీన్‌రైతు

11.6.1943

4 పేజీలు. అణా:

## నెల్లూరు ముచ్చట్లు

### బిరుదములు

గూడూరు వాస్తవ్యులు యర్రంరెడ్డి లక్ష్మీ నారాయణ రెడ్డి గారికిని, మాదరాజా గూడూరు వాస్తవ్యులు అత్రివరపు వెంకట్రామిరెడ్డి అనే చక్కెర రెడ్డి గారికిని, ప్రభుత్వం రావు సాహెబ్ బిరుదాలిచ్చి సత్కరించింది. అప్పటికి డివిజనల్ వార్ కమిటీ ఆర్గనైజర్లయిన (1) అబ్బయ్య నాయుడు, (2) పాణకా గోవింద రెడ్డి, (3) చక్కెర రెడ్డి, (4) యర్రంరెడ్డి లక్ష్మీ నారాయణ రెడ్డి మింజుమలె 4 గురిని రా.సా.తో సత్కరించారు.

జిల్లా యుద్ధ కమిటీ అధ్యక్షులైన రా.సా. ఒవ్వేటి విశ్వనాథ రావు గారికి రావు బహదూర్ యిచ్చారు. ఎ.యస్. కృష్ణరావు గారి నిర్యాణంతో గోల్పోయిన రావుబహదూర్ బిరుదాన్ని తిరుగా మనం సంపాయించుకున్నా మన్నమాట.

కొన్ని సంవత్సరాలుగా రాజభక్తిలో మునిగి తేలిన ఈ వ్యక్తి ఇక తరించి పోతాడన్న మాట.

కమ్మవారిలో తనొకడే జిల్లా బోర్డు సభ్యుడైతే తన సభ్యత్వానికి రాజీనామా యిచ్చి తిరస్కరిస్తా నన్నట్లు – రావు బహదూర్‌కు తక్కువ బిరుదు వస్తే తిరస్కరిస్తా మంటున్న చక్కెర రెడ్డి, లక్ష్మీ నారాయణ రెడ్డి గారలు త్యాగశీలి పద్మానాయ్డు గారి మాదిరి తిరస్కరిస్తారేమో చూడవలసి యున్నది. మరిగలిస్తే మిత్రుడైన కంవెర్ల లక్ష్మీ నరసింహం శెట్టి గారిని, యర్రం రెడ్డి లక్ష్మీ నారాయణ రెడ్డి గారిని తరతమ భేదములు లేకుండా ప్రభుత్వం సమాన ఆదరం చూపినందుకు సంతోషించాలి. ఐతే కంవర్ల శెట్టి గారికంటే లక్ష్మీ నారాయణ రెడ్డి గారు ప్రభుత్వ దృష్టిలో 6 మాసాలు వెనుక బడ్డారనే విషయం గమనార్హం.

### ఎ.సి.టి.వో. గారికి

నెల్లూరు తా. గంపేపల్లి వాసి కారంశెట్టి వెంకట రంగయ్య గారు ఖద్దరు

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

హాకింగుకు లైసెన్సు కోరితే మీ ఆఫీసు చుట్టూ, మీ గుమాస్తా చుట్టూ, ఆ జమానున్నాడే ఆయన చుట్టూ తిరగడానికి నెల రోజులు, రు. 4-5-6 లు వ్యయమైందని వ్రాస్తాడు. మీ ఆఫీసును కొంచం సరిజెయ్యండి సార్!

### ధాన్యం కొనుగోలు ఆఫీసరు

గ్రబ్బుదొర వచ్చి కూర్చొనున్నాడు. కొనుగోలు అధికారి రైతులను పు. 1 కి రు. 120 ల వంతున యివ్వమని రిక్విజిషన్ పద్ధతిని నోటీస్లు యిచ్చారు. ఇతరత్రా రు. 140 ల ధరకు కొంటున్నారు. ఏమిటీ ధరల వ్యత్యాస్త కారణం? పైగా రైతులే మేం బియ్యం జేసి యిస్తామంటే డిపాజిట్ కట్టమంటున్నారు. వ్యాపారస్తుడు కట్టడం ధర్మమే గాని పండించుకొనే రైతు డిపాజిట్ కట్టడం ధర్మం గాదు.

-విమర్శకుడు

### ఉన్నామాట చెప్పవద్దు!

భేష్

సెన్సార్ అధికారులు ఎక్కడివారైనా అఘటనా ఘటన ధురంధరులు వుంటారు. ఇంగ్లండులోని కమ్యూనిస్టు పత్రిక 'డెయిలీ వర్కర్' లో ఇటీవలి రష్యా–పోలండు తగాదా సందర్భంలో పోలండును గూర్చి బూతులు వ్రాశారు గనుక, అలాంటి సంపాదకీయాలు గల పత్రిక కాపీలను విదేశాలకు పంపగూడదని బ్రిటిష్ ప్రభుత్వం ఉత్తరువు చేసింది. సెన్సార్ అధికారులకు యిక పంపగూడదన్న మాటే గాని యుక్తాయుక్త విచక్షణ వారికెక్కడిది?

రెండవ రోజున వాషింగ్‌టన్ సమావేశం పై మిత్రమండలికి అనుకూలంగా డెయిలీవర్కర్ వ్యాఖ్యానించింది. కాని ఆ వ్యాఖ్యతో సెన్సార్లకేం నిమిత్తం? ఆజ్ఞాపాలనమే వారి విధి కనక సంపాదకీయం ఏదే కానీ విదేశాలకు పంపనివ్వ మంటె పంపనివ్వం అని వారు పట్టుపట్టారు.

# మార్గదర్శకురాలు మాలతీ చందూర్

ప్రఖ్యాత రచయిత్రి శ్రీమతి మాలతీ చందూర్‌కు "జమీన్‌రైతు" రామానాయుడు గారి అవార్డ్ ఇవ్వడం ఎంతో సముచితమైన విషయం. ఆమె బహుముఖ ప్రజ్ఞాశాలి అనడంలో ఎటువంటి సందేహం లేదు. గత మూడు శతాబ్దాలుగా నేను ఆంధ్రప్రభ వార పత్రికలోని ప్రమదావనం శీర్షిక చదవడం అలవాటుగా మారి పోయింది. ఇది స్త్రీల శీర్షికగా కన్పించినప్పటికీ ఆమె ఇచ్చే ఆణిముత్యాల్లాంటి సలహాలు విజ్ఞాన ప్రబోధకంగా, ఆలోచనాత్మకంగా ఉంటాయి. సలహాలు చదువుతున్నంత సేపూ ఆమె ఎదురుగా నిలబడి నడిపిస్తున్న అనుభూతి కలుగుతుంది. అటువంటి మార్గదర్శకురాలికి అవార్డు ఇస్తూ మే 28 తేదీన జమీన్‌రైతులో ఆమెను పరిచయం చేసిన తీరు హైలైట్‌గా వుంది.

కొచ్చిన్ –ఎస్. రామచంద్రా రెడ్డి

## కలహ భోజనుడు కె.వి.!

ఆనం – మాగుంట వర్గాల సంఘర్షణ విషయమై మీరు వ్రాసిన సమీక్షలో కె.వి.సుబ్బారెడ్డి పాత్ర గురించి ఒక్క మాటైనా రాయక పోవడం బాగోలేదు. ఈ అగ్నికి ఆజ్యం పోసిన కపట నాటక సూత్రధారి కె.వి. సుబ్బారెడ్డే! ఒరేవల్లి సంతాప సభ జరిగే రోజు వుదయం అన్ని దిన పత్రికల నిండా కె.వి. గారి వీరంగం కనపడింది. ఒక వైపు సంజీవ రెడ్డి, మాగుంట ప్రచారం పై చేసిన వ్యాఖ్యలను తాను అంగీకరిస్తున్నా నంటూనే మరో వైపు డి.సి.సి. అధ్యక్షుని అసమర్థతను, అవినీతి విషయమై బాధ్యతా రహిత వ్యాఖ్యలు చేశారు. మాగుంట సుబ్బరామ రెడ్డిగారు , కె.వి. సుబ్బారెడ్డి ఇలాంటి వ్యాఖ్యలు చేస్తారని కలలో కూడా ఊహించి వుండరు.

ఆ రోజు సంతాప సభలో అర్థాంతరంగా వచ్చి సుబ్బారెడ్డి వేదికెక్కి కూచోవడం మొగుణ్ణి కొట్టి మొగసాల చందంగా వుందింది. ఆయన గారి సభా ప్రవేశంలోనే వేడి ఆవిర్లు పుట్టుకొచ్చి జిందాబాద్‌ల ప్రహసనం మొదలయ్యింది. కొందరు వేదిక పైకి దూసుకొస్తుంటె సుబ్బారెడ్డి చిద్విలాసంగా చూస్తుండినారే గాని వాళ్లను ఆపే ప్రయత్నమే చేయలేదు. కొద్ది సేపు తరువాత చూచిన నాకు ఆయన కంట పడలేదు. అప్పుడు

## జనవాణి

గాని ఆయన ప్రతిభను సభలో ప్రేక్షకుడినైన నేను తెలుసుకో లేక పోయాను. ఏది ఏమైనా ఆనం, మాగుంట పై చేసిన విమర్శలను కె.వి. సుబ్బారెడ్డి తెలివిగా తన రాజకీయ లబ్ధి కోసం వాడుకొన్నారు.

నెల్లూరు–తిరుమూరు సుధాకర్ రెడ్డి

## తెలుగు అమలు చేయండి

రాష్ట్ర అధికార భాషా సంఘ అధ్యక్షులుగా శ్రీ గజ్జల మల్లారెడ్డి పదవి బాధ్యతలు స్వీకరించడం ముదావహం. అత్యంత మేధావి, అభ్యుదయ వాది, అనుభవశీలియైన 'గజ్జెల' వారు ఖచ్చితంగా పదవికి సమర్థులే. వావిలాల తరువాత విగ్రహ పుష్టి నైవేద్య నష్టి వలె తెలుగు అమలుకు ప్రయత్నం జరిగింది. ఏనాడో రాష్ట్ర సచివాలయంలో తెలుగు అమలుకు వచ్చిందని చెప్పడమే గాని, అది ఎంత వరకు నిజమో అందరి తెలిసిందే! మల్లారెడ్డి ఇటీవల ఒక పత్రికకు ఇంటర్వ్యూ ఇస్తూ మండల స్థాయి నుండి తెలుగు అమలుకు ప్రయత్నాలు ప్రారంభమయ్యాయని చెప్పారు. రెడ్డొచ్చె మొదలాయుఅన్నట్లు కాకుండా ఈ అంశాలు పరిగణన లోనికి తీసుకొంటే బాగుంటుంది. తెలుగు భాష స్పష్టంగా మాట్లాడే ఐ.ఎ.ఎస్. అధికారులను జిల్లా కేంద్రాలకు వేయాలి. ముందు సచివాలయం నుండే తెలుగు అమలు జరగాలి. తెలుగు టైపు రైటర్లు ఎన్ని తయారైతే అన్ని ఇంగ్లీషు టైపు రైటర్లను తీసి వేయాలి. తెలుగు వ్రాతగాళ్లకు ఇంక్రిమెంట్లు నిచ్చి ప్రోత్సహించాలి.

నెల్లూరు – వాస్తు రామచంద్ర

### అభినందనే

గత నెల 30 తేదీన కరవ 10 వ పేజీలో

# సాయి బాబా నిజాలు చెప్తే ఎంత బాగుంటుందో!

## సణుగుడు

సత్యసాయి బాబా పై కత్తులతో దాడి, హత్యాయత్నం; ఎవరు చేయని. ఎందుకు చేయని - సగటు మానవుడికైనా, దైవ స్వరూపుడికైనా ప్రాణ భయం ఒకటేనని రుజావు చేశాయి. మహిమలు కల్గిన ఆ మహిమాన్వితుడు కూడా మామూలు మనిషి వలె నిస్సహాయత ప్రదర్శించి, తలదాచుకోవడం గమనించాల్సిన విషయమే కదా! దేముడంతటి వారికైనా, (నేను దేముణ్ణని చెప్పుకోవడం కూడా బాబాకు అలవాటు) దాడంటే గుండెల్లో దడకు పుట్టే భయం. తన ప్రాణం దగ్గర కొచ్చేసరికి మహిమలూ పనిచేయలేదు. దాడి నుంచి తప్పించుకోవడానికి మనలాగే పరుగెత్తి పారిపోవడం తప్ప దైవ శక్తితో దాన్ని నివారించే సంకల్పం కల్గలేదు. గాలిలో నుంచి బంగారు దండలు, సువాసనలు వెదజల్లే బూడిద వచ్చినట్లు ప్రతిఘటనకు రివాల్వర్లు, కత్తులు కూడా రాలేదు. అసలు ప్రమాదాన్ని ముందుగా పసిగట్టే దైవశక్తి కూడా ఆ ఘడియలో పనిచేయలేదు. శక్తి మెరమిరదకు వచ్చినంత వరకు జరగబోయేది వూహించలేక పోయారాయన. సాయిబాబాను నమ్మే లక్షలాది మంది భక్తులు- జరిగేది, జరుగుతుంటేది, జరగబోయేది గ్రహించ గల మహిమ ఆయనలో వుందని విశ్వసిస్తారు. తన దైవశక్తి ద్వారా ఎదుటి వాడి మనసులో ఏముందో తెలుసుకో గల్గుతారని నమ్ముతారు. ఆయన మహిమలుగా ప్రచారంలో వుండే కథలన్నీ అవే!

బాబా శక్తి, బాబా మాటల లోనే వినండి - "అత్యంత శక్తివంతమైన దుర్భిణీ యంత్రములు కూడా చూడజాలని పదార్థములను నేను చూడగలను. ఎటువంటి ఎక్స్‌రే ఫోటోలు అవసరం లేకుండా రోగ నిర్ధారణ గావించగలను. ఏడు వేల సంవత్సరముల నాటి విషయములే కాదు, డెబ్బది వేల సంవత్సరముల నాటి విషయములు కూడా నాకు తెలుసు. నేను కాలముతో ముందు వెనుకలకు వెళ్లి కోరిన ఏదైనా చూడగలను. నేను ఒకసారి రెండు శరీరములందుండుట మీ కాశ్చర్యము కల్గించి వుండవచ్చు. మీకు నేనొక వస్తువు సృష్టించి బహూకరించితినని అనుకొనుడు. మీరెవరైనా పెద్ద ఆపద నందున్నప్పుడు అది నాకు వచ్చి చెబుతుంది. ఆ క్షణమే నేను మిమ్ము చేరి మీకు కావలసిన సహాయము నందించెదను" (ప్రేమజ్యోతి, పేజి 371)

కొన్ని లక్షల మంది భక్తులను ఆపద నుంచి రక్షించే శక్తి కల్గిన మహిమాన్వితుడు, తనను తాను రక్షించు కోవడానికి సైరన్లు, సెర్చిలైట్ల మీద ఆధార పడవలసి రావడం, కాలి శక్తి కొద్ది పారిపోవలసి రావడం దురదృష్టకరం అవునా, కాదా? 70 వేల సంవత్సరాల ఆవేతల, ఇవతల ఏమి జరగబోతుందో, ఏమి జరిగిందో గ్రహించే శక్తి గల అవతార పురుషుడు తన పై జరగబోయే హత్యా ప్రయత్నాన్ని కనీసం 70 సెకన్ల ముందు కూడా వూహించ లేక పోవడం విచారకరం అవునా, కాదా? మనసులో తలచినంతనే ఎక్కడో వుంటే భక్తుడి సమక్షంలో క్షణంలో వాలి ఆపద నుంచి రక్షించే మహిమ గల దైవ స్వరూపుడు తన పడక గది ఎదుట, తన ప్రాణం కాపాడడానికి ప్రయత్నించి, చనిపోయిన తన స్వంత సేవకులను కాపాడ లేక వెర్రి పడటం శోచనీయం అవునా, కాదా? నేను సత్యసాయి బాబాను హేళన చేయడం లేదు; ఎంతో శక్తివంతమైన సూపర్ కంప్యూటర్ కూడా ఒక్కొక్కసారి వైరస్ సోకో, కరెంట్ పోయో పని చేయడం మానేసినట్లు - బాబా శక్తులు కూడా ఆ క్షణంలో మొరాయించి వుంటాయని స్వాంతన పరుస్తున్నాను. అంతే!

శక్తుల సంగతి దేముడెరుగు- అసలు బాబాను చంపవలసిన అవసరం ఎందుకు వచ్చింది? ఆయన సేవలో వుండేవారే ఆ పాపానికి ఎందుకు వడిగట్టబోయారు; పోలీసులు వారిని ప్రాణాలతో పట్టుకోకుండా ఎందుకు కాల్చి చంపారు? కేవలం కత్తులు, సుత్తులు మాత్రమే వున్న హంతకులను

### డోలేంద్ర

లొంగదీయడం పోలీసుకు చేతకాలేదంటే నమ్మలేము. అందులోనూ వారెక్కడికీ పారిపోలేదు; ఒక గదిలో భద్రంగా వుండినారు. వారిని ప్రాణాలతో పట్టుకొని వుంటే నిజాలు బయటకు వస్తాయనే భయంతో కావాలని చంపారా? ఎప్పుడూ జనం తిరిగే చోట, రాత్రి పగలు పహరా కాసే చోట మందు పాతరలు పెట్టడం ఎట్లా సంభవమైంది? అసలు బాబా గదిలో రహస్య సైరన్లు సెర్చిలైట్లు ఎందుకు వుండినాయి? తన ప్రాణానికి ప్రమాదం వుంటుందని ఆయన ఎప్పటి నుంచో భయపడుతుండినాడా? ప్రేమ స్వరూపుడైన వ్యక్తికి ప్రాణ భయం కల్గించే పరిస్థితులెందుకు ఏర్పడ్డాయి? అటువంటి పరిస్థితులు ఆయన రహస్య జీవితంలో వున్నాయా? వుంటే ఏమిటవి? ఈ ప్రశ్నలు వేసే ధైర్యం, జవాబులు సేకరించే సాహసం ఏ పోలీసధికారికీ, ఏ ప్రభుత్వ నేతకు వుండను కూడా వుండవు. పౌరాధినేతలైన రాష్ట్రపతి, ప్రధానులే బాబా కాళ్లకు మొక్కుతున్నప్పుడు బాబా రహస్య జీవితం పై ఆరా తీసే దమ్ము ఎవరికుంటుంది?

సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రులు కట్టించి, ఉచిత వైద్య సేవలు చేసినంత మాత్రాన, ధర్మకార్యాలు చేసినంత మాత్రాన ఏ వ్యక్తి తప్పులూ, నేర ప్రవృత్తి ప్రశ్నించరానివి కావు. తమ అంధ విశ్వాసాలతో, సాధారణ వ్యక్తులను దైవ సమానులుగా భావించడంతో పాటు, వారిని చట్టానికి అతీతులుగా పరిగణింప జేసే నాయకులు - తాము ప్రజలకెంత ద్రోహం చేస్తున్నది ఒక్కసారి ఆలోచించ

కొరవ 8 వ పేజీలో

* లక్ష్మీ శివ పార్వతి అక్రమ సంబంధంతో ఎన్టీఆర్ నిజరూపం బట్టబయలు.

* మాగుంట సుబ్బరామ రెడ్డి రాజకీయ శైలి మారాలి!

********

## భావ వీచికలు

**తిరుమూరు సుధాకర్ రెడ్డి**

ఎందుకోసం?
నిప్పుల కొలిమై
వెలుగును మండించేది
చంద్రుడు
తప్తశిలయై
చలువను చిలికించేది
భూగోళం
తిరగలియై
పరిభ్రమించేది
తిరుగుబోతు మేఘం
తొలకరి చినుకై
కరిగి పోయేది
ఒక మనిషి కోసం!
మనిషి కులమై
మనసు మతమై
దిగజారి పోయేది - ఎవరి కోసం??

********

### గ్రీష్మతాపంతో తల్లడిల్లే వారి మెదళ్ల చల్లబరచిన

# సాహితీ వసంతం: తిక్కన తిరునాళ్ల

గ్రీష్మతాపంతో అల్లాడుతున్న సింహపురి సాహితీ అభిమానులపై తిక్కన విజ్ఞాన కేంద్రం గత వారమంతా సాహితీ వసంతం కురిపించి ఊరట కల్గించింది. మే 24,25,27,28,29 తేదుల్లో టౌన్‌హాల్‌లో జరిగిన తిక్కన సాహిత్యోపన్యాసాలకు విజ్ఞాన శాస్త్రాంశాలు కూడా జత కలిశాయి. తొలిరోజు సభలో విజ్ఞానకేంద్రం వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ మనుపూరు కోదండరామిరెడ్డి ప్రారంభోపన్యాసం చేశారు. సంస్థ బాలారిష్టాలను అధిగమించిన తీరు వివరిస్తూ;ఈనాటి యువతరంలో సాహిత్యాభిలాష బొత్తిగా లేకపోవడం పట్ల ఆవేదన చెందారు. సభను అధ్యక్షించిన ఐ.ఎ.ఎస్ అధికారి మాజీ కలెక్టర్ శ్రీ టి. మునిరత్నం మాట్లాడుతూ సాహిత్య సభలు అధిక ప్రజాదరణ పొందడానికి వీలుగా సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటు చేయాలని సలహా ఇచ్చారు. వాకాడు కాలేజి లెక్చరర్ డాక్టర్ అమరా పరంధామ విద్యారంగంపై విజ్ఞాన సాంకేతిక విషయాల ప్రభావాన్ని వివరించారు. ప్రొఫెసర్ కోవెల సంపత్కుమారాచార్య ద్రోణపర్వాన్ని కళ్లకు కట్టినట్లు చెప్పారు.

రెండోరోజు అంటే 25 తేదిన సభను వి.ఆర్ కాలేజి చరిత్రోపన్యాసకులు డాక్టర్ సి.వి.రామచంద్రరావు అధ్యక్షించారు. కళాశాల వ్యవస్థాపక కార్యదర్శి సి.సి. సుబ్బరాయుడు అధ్యక్షతన సభ జరిగింది. 28 తేది సభలో వెంకటగిరి ప్రభుత్వ కళాశాల ఆంధ్రోపన్యాసకులు శ్రీ పచ్చి పులుసు వెంకటేశ్వర్లు కృష్ణ తత్వాన్ని రసరమ్యంగా చెప్పారు. శ్రీ


సుందరకాండ సప్తాహ ముగింపు సభలో వక్త డాక్టర్ ఎ. శేషకుమార్‌ను సన్మానిస్తున్న పోలూరి హనుమజ్జానకి రామ శర్మ, వాకాటి పెంచలురెడ్డి, బి. సీతారామ శాస్త్రి

ముఖ్యోపన్యాసకులు కాకతీయ విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ కోవెల సంపత్కుమారాచార్య పినాకినీ నదీ తీరాన రంగనాథ క్షేత్రమున్న నెల్లూరులో వైష్ణవ క్షేత్రాల వైశిష్ట్యాన్ని పేర్కొంటున్న పాండురంగ మహత్య కావ్యంపై సాహిత్య సభ జరగడం ముదావహమన్నారు. 27తేది సభలో నెల్లూరు యువ శాస్త్రవేత్త డాక్టర్ ఎ.జగదీష్ ఆవేదనకు అర్థం వుంది. ఇతర దేశాల వాళ్లు మన శాస్త్రవేత్తల పరిశోధనాంశాలను వుపయోగించుకొని ప్రశంసిస్తుంటే మనదేశంలో మనకెందుకులే అని పాత పద్ధతుల గాడిన సాగుతుండడం ఆత్మహత్యా సదృశ్యమన్నారు. మరో వుపన్యాసకులు శ్రీ సురభినరసింహం ఆధునిక కవుల్లో దేశభక్తి పెల్లుబుకడం గొప్ప విషయమన్నారు. సర్వోదయా మాడభూషి సుందరాచార్యులు సభను అధ్యక్షించారు.

కడపటి రోజు కార్యక్రమానికి ప్రముఖ న్యాయవాది శ్రీమద్దాళి మల్లిఖార్జున రావు అధ్యక్షులు. రాజమహేంద్రవరం ... యువతి ఒరియంటల్ కళాశాల రిటైర్డు ప్రిన్సిపల్ శ్రీ మల్లంపల్లి శరభేశ్వర శర్మ మానవ జీవిత పరమార్థాన్ని కాశీఖండ వైశిష్ట్యాన్ని వివరించారు.

ప్రతిరోజు సభలో వుపన్యాసకులను తిక్కన విజ్ఞాన కేంద్రం కార్యదర్శి శ్రీ దుగ్గాట్టి వెంకటరమణయ్య పట్టు వస్త్రాలతో సత్కరించారు. వర్ధమాన సమాజ కార్యదర్శి శ్రీ బి.వి. నరసింహాలు గారిస్వాగత, కృతజ్ఞతాభి వందనాలు షరామామూలే.

కొరవ 10 వ పేజీలో

## నెల్లూరు సంగతులు

# మీ చిన్నారుల ఆరోగ్యమే మహద్భాగ్యం!

## చిన్న పిల్లల
# రవి హాస్పిటల్

పొగతోట
నెల్లూరు
ఫోన్: 28562



నూతన
భవనప్రారంభం
తే॥ 13-6-93
సా॥ 6గం.లకు.

### మీ చిన్నారిపాపల ఆరోగ్య సంరక్షణే మాధ్యేయం

చిన్నారి పొన్నారి, చిట్టిపొట్టి పాపాయిల చిరునవ్వులలో ఎంత మాధుర్యం ఉందో, అనారోగ్యంచే కలతబారిన వారి మోములోని చిరాకు ఎంత ఆవేదనను కలుగచేస్తుందో, పిల్లలుగల ప్రతి తల్లిదండ్రులకు అనుభవమే.

మీ పిల్లలకు సంపూర్ణఆరోగ్యం, మరింత మెరుగైన సేవలను అందించేందుకు కావలసిన అత్యాధునిక వైద్యపరికరాలు విశాలమైన నూతనభవనంలో నెలకొల్పబడి *'రవి చిన్న పిల్లల హాస్పిటల్'* నెల్లూరు జిల్లా ప్రజల సేవకు అంకితమైనది.



**Open care Incubator System :**

నెలలు నిండని బరువుతక్కువగా జన్మించే శిశువుల, తల్లి గర్భంలోనే వివిధ రకాల వ్యాధులకులోనై అనేక లోపాలతో జన్మించే బిడ్డల సంరక్షణార్థమై ఆధునిక వైద్యవిజ్ఞాన ప్రపంచం అందించిన అత్యుత్తమ వైద్య పరికరమే ఈ Open care Incubator ఇది open గా వుండటం వల్ల బిడ్డను Incubator లో నుంచే, వ్యాధిని బట్టి అవసరమైన శస్త్రచికిత్స జరుపవచ్చు, సెలైన్లు అమర్చుకోవచ్చు, త్వరితగతిన మామూలు వాతావరణానికి బిడ్డ అలవాటు పడునట్లుగా చేయవచ్చు. ఇది పూర్తిగా కంప్యూటర్ ద్వారా నిర్దేశింపబడుతూ, అనేక యంత్రముల సహాయంతో, బిడ్డ శరీర ఉష్ణోగ్రతను బట్టి తేమ వ్యాపింపచేసే వాతావరణంయొక్క ఉష్ణోగ్రత సమతౌల్యాన్ని పాటిస్తూ, శిశువుకు తల్లి గర్భంలో వున్నట్లే అనుభూతిని అందిస్తుంది. ఇది ఒక అద్భుతమైన ప్రక్రియ. ఈ ఆధునిక వైద్యసదుపాయాన్ని మేము నెల్లూరు జిల్లా ప్రజలందరికీ అందుబాటులో వుంచాలనే ధ్యేయంతో, నెల్లూరు జిల్లాలోనే ప్రప్రథమంగా మా ' రవి చిన్నపిల్లల ఆసుపత్రి ' యందు ఈ వైద్యపరికరాన్ని నెలకొల్పడమైనది.



**Phototheraphy Unit :**

పచ్చకామెర్లు అనే ప్రాణాంతకమైన వ్యాధికి పుట్టినశిశువులలో నూటికి 60% గురౌతున్నారు. ఈ వ్యాధిని నయంచేయడంలో ప్రపంచ వ్యాప్తంగా అమలులో వున్న అన్ని పద్ధతులలోకెల్ల, ఫోటోథెరపీ విధానం, ఎంతో శక్తివంతంగాను, మరింత క్షేమదాయకంగాను కామెర్ల వ్యాధిని నివారించే విధానంగా ఆధునిక వైద్యరంగంచే ఆమోదింపబడి నటువంటిది. ఈ పరికరాన్ని కూడా పిల్లల సంరక్షణార్థమై మా హాస్పిటల్ నందు నెలకొల్పడం జరిగింది.



**Biomoniter :**

ఈ యంత్రసహాయంచే పసిబిడ్డ గుండె కొట్టుకొనే వేగాన్ని, ఊపిరితిత్తుల చలనాన్ని, నాడీచలనపు వేగాన్ని, శరీర ఉష్ణోగ్రతను మొదలైన అన్ని అంశాలను, ఏకకాలంలో నేరుగా మానిటర్ పైన ఖచ్చితంగా డిజిటల్ రూపంలో కొలచి చూడవచ్చు. తద్వారా చికిత్సత్వరిత గతిన చేసేవీలు గలుగుతుంది.

సదా మీసేవలో
డా॥ జి. రవికుమార్ M.D.D.CH.



PARDHA

# నెల్లూరు ముచ్చట్లు

## విమర్శకుడు

### మంత్రులు

కార్మిక మంత్రి శ్రీ పి. జనార్దన రెడ్డి 9 తేది నెల్లూరు వచ్చారు. ఉదయగిరిలో మాజీ మంత్రి శ్రీ మాదాల జానకిరాం ఆతిథ్యంలో గడిపి, వెళ్లిపోయారు.

* * *

సమాచార మంత్రి శ్రీ పసల పెంచలయ్య 9 తేది హైదరాబాదు వెళ్లారు; తిరిగి 17 తేది నెల్లూరు రావచ్చునని అనధికార వర్తమానం.

### దాడి జరగలేదు

28 తేది ఇందిరా భవన్ ఆవరణలో ప్రవీణ్ కుమార్ రెడ్డి అనే యువకుడ్ని ఆనం అనుచరులు కొట్టారని గత వారం మేమిచ్చిన వార్త ఆ యువకుడికి బాధ కలిగించి నట్టుంది. ఆనా సమయంలో అక్కడున్న మాట నిజమే కాని, తననెవరూ కొట్టలేదని, తరమ లేదని ప్రవీణ్‌కుమార్ రెడ్డి చెప్పారు.

మా వార్త మనస్తాపం కల్గించి నందుకు విచారం వ్యక్తం చేస్తున్నాము.

### నారాయణకు నాలుగవ ర్యాంకు

నారాయణ విద్యా సంస్థలో ర్యాంకుల పంట ఈ ఏడాది బాగానే పండింది. రెసిడెన్షియల్ జూనియర్



కాలేజి విద్యార్థి కుమారి చావరాల హిమబిందు ఈ ఏడాది ఇంటర్మీడియట్‌లో రాష్ట్రంలో నాలుగవ ర్యాంకు సంపాదించి వెయ్యి మార్కులకు 918 మార్కులు సంపాదించింది. ఆమెది కోదాడ; తండ్రి కాలేజి లెక్చరరు, తల్లి హై స్కూలు టీచరు. 10 తరగతి వరకు అక్కడే చదివింది. ఎపి రెసిడెన్షియల్ జూనియర్ కాలేజి ఎంట్రెన్స్ పరీక్షలో ఫస్టు ర్యాంకు సాధించినా, ఆ కాలేజిలో వసతులు బాగలేవని నారాయణ కాలేజిలో చేరిందట. నారాయణ సంగతి తెలిసిందే కదా– బాగా రుబ్బించేసినట్లున్నాడు – నాలుగవ ర్యాంకుతో తనకు, తనకు చదువు చెప్పిన కాలేజికి ప్రతిష్ట తెచ్చిందా బాలిక. ఎమ్‌సెట్ కోచింగ్ కూడా నారాయణ దగ్గరే తీసుకొంటున్నది; దానిలోనూ ర్యాంకు గ్యారంటీ అనుకోవచ్చు.

నెల్లూరులోని కోచింగ్ సెంటర్లన్నిటిలోకి నారాయణే ఫస్టున నిలుస్తున్నారు. ప్రతిభ, అదృష్టం కలగలిస్తే వచ్చే ఫలితమది. ఆ ఉత్సాహంతోనే ఈ ఏడాది మహిళా రెసిడెన్షియల్ జూనియర్ కాలేజి ఒకటి ప్రత్యేకంగా నెలకొల్పుతున్నారు; పై ఏడాది అంతర్జాతీయ స్థాయిలో ఒక ఇంగ్లీషు మీడియం స్కూలు పెట్టబోతున్నారు. వంద ఎకరాల స్థలంలో, అన్ని ఆధునిక వసతులతో రాబోతున్నది స్కూలు. మంచి చదువు కోసం పిల్లల్ని చంకన పెట్టుకొని మద్రాసుకు పరుగెత్తాల్సిన అవసరం లేకుండా చేస్తే నారాయణకు జిందాబాద్ కొడతారు తల్లిదండ్రులు.

### ఇందుకూరు పేట ఎమ్మార్వో పై దాడి

ఇందుకూరు పేట మండలం రెవిన్యూ అధికారి పై దళిత నాయకులు దాడి జరిపి, కొట్టారన్న ఆరోపణ పై రెవిన్యూ ఉద్యోగులకు దళిత సంఘాలకు మధ్య పెద్ద వివాదం నడుస్తున్నది! ఇందుకూరు పేట మండలం రాముడు పాళెంలో శ్రీ ఆదాల రాఘవ రెడ్డికి ప్రభుత్వం రొయ్యల పెంపకం కోసం 100 ఎకరాల భూమి కేటాయించింది. 1986 లో అప్పటి ఎన్టీఆర్ ప్రభుత్వం కేటాయించిన భూమి ఇది. గత సంవత్సరం స్వాధీనం చేశారు. అది తమకు ఆది వరకే ఇస్తామని చెప్పి వున్నారని స్థానిక హరిజనులు ఆందోళన చేశారు. మాజీ కలెక్టర్ శ్రీ కె. రాజా వారితో చర్చలు జరిపి, వారికి ప్రక్కనే వేరొక పొలం ఇచ్చేందుకు ఒప్పించి అప్పుడు ఉపశమింప జేశారు. ఆ రోజు ఏమైందో గాని ఆ తర్వాత మళ్లీ ఆందోళన మొదలైంది. అప్పుడప్పుడూ ధర్నాలు, ప్రదర్శనలు నిర్వహిస్తున్నారు. స్థానిక హరిజనులకు ప్రత్యామ్నాయంగా ఇతర పొలం ఏదీ ఇవ్వక పోవడం కూడా ఈ ఆందోళన కొనసాగింపుకు కారణం. అదే ప్రకారం మొన్న 8 తేది ఇందుకూరుపేట ఎమ్మార్వో కార్యాలయం ఎదుట దళిత నాయకుడు, బ్యాంకు ఉద్యోగి శ్రీ ఎస్. ప్రసాద్ నాయకత్వంలో ధర్నా చేశారు. ఆ సమయంలో ఎమ్మార్వోతో వాదం పెట్టుకొని కొందరు దళితులు ఆయన పై చెయ్యి కూడా చేసుకున్నారట. ఎమ్మార్వో గారు పోలీసు కేసు పెట్టారు. అధికారులకు, ఉద్యోగులకు రక్షణ కల్పించాలని, దౌర్జన్యం చేసిన వారి పై చర్య తీసుకోవాలని రెవిన్యూ సర్వీసెస్ అసోసియేషన్ ఆందోళన ప్రారంభించింది. వారికి వివిధ ప్రభుత్వోద్యోగ సంఘాలు మద్దతు పలికాయి. కేసులు విత్‌డ్రా చేయాలని ఇంకొక ప్రక్క దళితుల సంఘాలు రాస్తారోకోలు, ఊరేగింపులు నిర్వహిస్తున్నాయి. అసలు భూమి సమస్య ప్రక్క దారి పట్టిపోయింది; ఈ వివాదం క్లిష్ట సమస్యగా రూపాంతరం చెందింది.

విధి నిర్వహణలో వున్న అధికారుల పై దౌర్జన్యం చేసే సంస్కృతి ప్రోత్సహించ దగింది కాదు. ఆందోళన చేయవచ్చు. కోరికలు చెప్పవచ్చు. పట్టుబట్టి సాధించ వచ్చు కాని దౌర్జన్యంతో అధికారులను లొంగదీయ జూస్తే పరిపాలన అపహాస్యం పాలౌతుంది. ఏ ఉద్యోగి కూడా పని చేయలేదు. అందువల్లే అన్ని

కొరవ 7 పేజీలో

## నెల్లూరు ముచ్చట్లు

(6 వ పేజీ తరువాయి)

ఉద్యోగ సంఘాలూ ఈ సమస్య విషయంలో ఎమ్మార్వోకు న్యాయం చేయాలని భీష్మించుకుని వున్నాయి. మిమ్మల్ని కొట్టినేలిదని దళిత నాయకులంటారు. కలెక్టర్ గారు ఉభయులనూ పిలిపించి, లోతుగా దర్యాప్తు జరిపించి, దీనికో పరిష్కారం కనుగొనడం అవసరం.

### గుండె నొప్పి చికిత్స

గుండె జబ్బుల చికిత్సలో అత్యంత నిపుణులైన మద్రాసు డాక్టర్ శ్రీ సత్యమూర్తి 20 తేది ఉదయం నెల్లూరు రామచంద్రా రెడ్డి ఆస్పత్రిలో రోగులను ఉచితంగా పరీక్షిస్తారు. లయన్స్ క్లబ్ ఆధ్వర్యంలో ఈ ఉచిత శిబిరం నిర్వహించ బోతున్నారు.

హృద్రోగులు ఈ సదవకాశాన్ని వినియోగించు కోవాలని క్యాంప్ చెర్మన్ డాక్టర్ సత్యనాథ్ ఆహ్వానిస్తున్నారు.

### పాలధర పెంపు

పాల ధరను జూలై 1 తేది నుంచి 7 నుంచి ఏడున్నర రూపాయలకు పెంచుతున్నట్లు డైరీ చెర్మెన్ శ్రీ బెజవాడ సురేష్ రెడ్డి తెలియజేస్తున్నారు. పడమటి గాలులు, ఎండల వల్ల పాల దిగుబడి తగ్గి తగిన సరఫరా చేయడం ఇబ్బందిగా వున్నదట. రైతులకు అధిక ధర చెల్లించ వలసి వస్తుందదంతో ఈ హెచ్చింపు తప్పడం లేదని సురేష్ రెడ్డి సంజాయిషీ!

### ఖడ్గ తిక్కన

రెండు వారాల క్రితం టివిలో ప్రేక్షకులకు కనువిందు చేసిన గ్రిద్దలూరు గోపాల రావు 'ఖడ్గతిక్కన' నాటికను 13 తేది ఆదివారం మధ్యాహ్నం 3.30 గంటలకు విజయవాడ రేడియో స్టేషన్లో ప్రసారం చేస్తున్నారు. టివిలో మిస్ అయిన వారికి నెల్లూరు కార్య పరాక్రమాలు తెలుసుకునే ఛాన్సు ఇది. తప్పక విని, గోపాలరావు గారికి అభిప్రాయాలు తెల్పండి!

### ఉద్యోగ సంఘం ఎన్నిక

ఆంధ్రప్రదేశ్ నాలుగవ తరగతి ఉద్యోగుల సంఘం రాష్ట్ర కార్యదర్శిగా నెల్లూరీయుడు శ్రీ ఆరంబాకం చంద్రశేఖర్ ఎన్నికైనారు. ఆయన నెల్లూరు జిల్లా తెలుగు గంగ ప్రాజెక్టు నాలుగవ తరగతి ఉద్యోగుల సంఘం అధ్యక్షుడు కూడా! మన రాజసింహ కుమారుడు. ఆయనకు మా అభినందనలు.

### కలువాయి గోపాల రెడ్డి మృతి

కలువాయి మాజీ మండలాధ్యక్షుడు, చురుకైన కాంగ్రెస్ యువ నాయకుడు, కాంట్రాక్టరు డాక్టర్ బి. గోపాలరెడ్డి 10 తేది హఠాత్తుగా మరణించారు. తీవ్రమైన గుండెపోటు ఆ యువకుడిని అకాలంగా బలి తీసుకున్నది. గోపాల రెడ్డి డాక్టరు చదివి, కొద్ది కాలం ప్రాక్టీసు తర్వాత వ్యాపార రంగానికి వెళ్లిపోయారు. కలువాయి సర్పంచ్‌గా మంచి పేరు తెచ్చుకున్నారు. ఆయన వయస్సు 48 సంవత్సరాలు.

వారి కుటుంబానికి మా సానుభూతి.





### రామచంద్రాపురం సబార్డినేటు జడ్జి కోర్టులో

Between:

E.P. 45/1992 : O.S. 62/1988

M/s. భాగ్యలక్ష్మి ఫైనాన్స్ కార్పొరేషన్ మండపేట, rested in Managing Partner రెడ్డి బ్రహ్మాజి చౌదరి - D.Hr.

ఏలేటి వెంకట్రావు - J.Dr.

#### ప్రకటన

పై నెంబరు వారంటు బాకీ తీర్మానం నిమిత్తం J.Dr తాలూకు షెడ్యూలు దాఖలా ఆస్తిని 1.7.1993 తేదిన ఉదయం 10.30 గంటలకు పై కోర్టు వారి ఎదుట బహిరంగ వేలం జరుగును. కావున పాడుకొన దలచిన వారు పాడుకొన వచ్చును. పాట షరతులు D.H.R. అడ్వోకేటు గారి ఎదుట గాని పై కోర్టు వారి ఆఫీసులో గాని దొరుకును.

#### షెడ్యూలు

తూ.గో. జిల్లా మండపేట సబ్ డి.లో చేర్చి మండపేట గ్రామము తాలూకు తరవాణి పేట వీధిలోని J.Dr కు స్వాధీన సంపూర్ణ హక్కు భుక్తములు గల డోరు నెం. 4-8-4 (New 4-8-6) గల డాబా ఇల్లు అందులోని నివాశ స్థలంకు హద్దులు

తూర్పు: రాజా వీధి; పడమర: బట్టూరి సత్యనారాయణ అనే సూర్యనారాయణ యిల్లు; ఉత్తరం: మునిసుధాకర్ గారి ఖాళీ స్థలం; దక్షిణం: వుంగరాల బూరయ్య గారి యిల్లు

సదరు హద్దులు మధ్యస్థమైన డోరు నెం. 4-8-4 (New 4 - 8 - 6) కు గల డాబా యిల్లు తల్పులు, ద్వారబంధములు పై కప్పు యీజిమెంటు హక్కులతో సహా వేలం కావలెను.

D.Hr value Rs. 1,25,000/-

అమీనా వాల్యు రు. 1,40,000/-

మద్దూరి శివసుబ్బారావు
డి.పి. శాస్త్రి
DHr తరపున అడ్వోకేట్లు
రామచంద్రాపురం

# శివారెడ్డి పద్యాలు

## ముసలమయ్యి నారె మూలమునకు

ఎక్కి గద్దె రాజ్యమేలా లని వుంది
అది మంచి ఎంతో ఆశ వుంది
కవి మిరాలకించి, కామందు కవిపేల
ఎవరు గూర, పైన ఎలికల్లో
కమ్యూనిస్టులైన, కాంగ్రెసు వారైన,
ఎవ్వరైన గద్దె నెక్కు వరకె
పైకి వెళ్ళినాక ప్రతివారు మా వారె
కవికి దగ్గరౌత కాకపోత!

ఈ పారి యెన్నికలకి
దానుడు వుంటాడో, వూడుతాడో చెప్పి
మాసెవరు? మంచి సెబ్బర
చూసి కండిసెంత వ్రాస్త కోరన జేస్తా!

బాలిబ్ పద్ధతి సరిలా
ఆలోచించారు గారు అసలు కె మోసం
నేలిరి పాము జేస్తె
కూలి పోర్ది కాంగిరేసు కుంగు కిల్లలో

కమ్యూనిస్టులెవరో, కాంగ్రెసు వారెవరో
తెలుగుదేశమేదో, తెలుసుకోడం
కష్టసాధ్యమైన కార్యమ్ము, వన్నీలు
అల్పస్వల్పకవిక, అది దురూహ్యం!

పెద్దజేసి మిమ్ము గద్దె పై కెక్కిస్తె
పైకి బంపై, మంత్రి పదవులిచ్చి
వెసురు బెట్టినారె అసలకె నాయన్లు!
ముసలమయ్యి నారె మూలమునకె

## సణుగుడు

(4 పేజీ తరువాయి)

పరిస్థితికి కారణాలు ప్రపంచానికి తెలుస్తాయి!

సత్యసాయి బాబా అంటే నాకు ఒకే ఒకందుకు ఇష్టం. కొన్ని లక్షల మంది భక్తులు కల్గి, తాను ఏమి చెప్తే అది చేసే వారుండి కూడా ఆయనెప్పుడూ మతోన్మాదం రెచ్చగొట్ట లేదు; పరమత ద్వేషం పెంచలేదు; రాజకీయాలలో తలదూర్చలేదు; రాజకీయ నాయకులను కీలు బొమ్మలుగా ఆడించ గల్గుతున్నప్పటికీ ఏ కుంభకోణంలోనూ చిక్కుకోలేదు; తన సంపాదన ఎంతో ప్రపంచానికి చెప్పకపోయినా, పన్నులు కట్టకపోయినా అందులో కొంతైనా మంచి పనులకు వాడుతున్నారు. ఈ ఒక్క మినహాయింపు తప్పిస్తే, సమాజానికి ఇటువంటి బాబాలు, అమ్మలు చేసే ఉపకారం కంటే అపకారమే ఎక్కువ. వారిని ప్రోత్సహించడం రక్షించడం సమాజానికి చేటు చేయడమే అవుతుంది.

సత్యసాయి బాబా, దాదాపు 30 ఏళ్ల తాను అవతార పురుషుడనని లోకాన్ని నమ్మించ గల్గారు; దేశాధినేతలను తనకాళ్ల దగ్గరకు రప్పించుకో గల్గారు. సిల్కు చొక్కాల నుంచి, ఫారెన్ సెంట్ల నుంచి, హంసతూలికా తల్పాల నుంచి, ఎయిర్ కండిషన్ చల్లదనాల నుంచి, స్వంత విమానాల దర్పాల వరకు సర్వ సుఖాలూ అనుభవించ గలిగారు. అంతటితో తృప్తి చెంది, తన్నంతట తానుగా తానింత కాలం ప్రజలనెట్లా ఫూల్స్ చేయగల్గింది, ప్రజలెంత వెర్రి వాళ్లయిందీ వివరించి చెప్పగల్గితే ఎంత బాగుంటుందో కదా? అది బాబా కీర్తిని సైతం పెంచదా?

పాపం శమించు గాక; బాబా భక్త సందేహం నన్ను క్షమించు గాక!

* * *

భక్తితో ప్రజలను ఫూల్స్ చేయడంలో బాబా ఎంత ఘనాపాటో, నటనలో అదే ప్రజలను గొర్రెలుగా మార్చడంలో ఎన్టీరామారావు గారు అంతకంటె ఘనమైన మేటి! ఆయన తనకు తాను దైవ స్వరూపుడనని భావించుకుంటే ఈయన తనకు తాను ధర్మమూర్తినని చాటుకుంటుంటాడు. హత్యా ప్రయత్నం అయినా శక్తి మహిమలను ఎట్లా సందేహాస్పదం చేసిందో; లక్ష్మి శివ పార్వతితో అక్రమ సంబంధపు వదంతి ఈయన నైతిక వర్తనాన్ని అట్లా ప్రశ్నార్థకం గావిస్తుంది!

నీతి, న్యాయం, నైతిక ప్రవర్తన, ధర్మాచరణ, విలువలు, సాంప్రదాయాలు, తెలుగింటి ఆడపడుచుల ఆత్మగౌరవం, మట్టిగడ్డలు అని ఇల్లెక్కి రంకెలు పెట్టడం ఎన్టీఆర్ తత్వం. అటువంటి వాడు ఈ పండు ముదుసలి వయస్సులో, పక్షవాతం వాత పడబోయి తప్పించుకున్న దశలో ఒక వివాహిత యువతితో అక్రమ సంబంధం పెట్టుకున్నాడన్న ఆరోపణకు గురికావడం కంటే సిగ్గుచేటైన విషయమేముంది? రాష్ట్రాన్ని పరిపాలించిన వ్యక్తి, ఆరు కోట్ల ఆంధ్రుల చేత ఆరాధ్య నాయకుడిగా నీరాజనాలందుకున్న వ్యక్తి ఇంత నీచ ప్రవృత్తి కల్గిన వాడంటే ఎంత ఘోరం?

దక్కన్ క్రానికల్ వెలుగులోకి తెచ్చిన వివరాల ప్రకారం – లక్ష్మి శివ పార్వతి అనే ఈ వివాదా స్పద యువతి, గుంటూరు జిల్లా నరసారావు పేట కాలేజిలో సంస్కృత లెక్చరరు. ఎన్టీఆర్ అభిమాని. ఆమె భర్త వీరగంధ సుబ్బారావు హరికథకుడు. ఎన్టీఆర్ జీవిత చరిత్ర వ్రాయాలనే ఉద్దేశ్యంతో ఆమె మొదట అబిడ్స్ నివాసానికి వచ్చిందట. ఆమె అందం చూసి, ఈ ముసలి మన్మథుడు మైమరచిపోయాడు. ఇద్దరి మధ్య సాన్నిహిత్యం పెరిగింది. ఆమె కాలేజి వదలి పెట్టి ఎన్టీఆర్ ఇంట్లోనే మకాం పెట్టింది. మొదట మొదట ఆయన కుటుంబ సభ్యులు ఈమె రాకపోకలను పెద్దగా పట్టించుకోలేదు. 70 ఏళ్ల ముసలి వాడిలో రిమ్మ తెగులు పుడుతుందని వారెట్లా కలగంటారు పాపం? వారు కలదెలుసుకునే, సరికి పరిస్థితులు తారుమారై పోయాయి. శివ పార్వతి తన భర్తకు విడాకులిచ్చేసిందట; మూడు నెలల గర్భం ధరించిందట; ఎన్టీఆర్ ఆమె కోసం బంజారా హిల్స్‌లో ఒక భూరి సౌధం నిర్మాణం తలపెట్టాడట.

అప్పుడు కల మెలుకోవి ఇదేమి పాడుపని అని అడిగితే ఆ వృద్ధ ధనికుడు అరంతే నన్నాడట. కంటికి కన్నురకుండా చేస్తే మర్చిపోతాడని భావించి ఆమెను ఇంటి నుంచి బయటకు తీసుక వెళ్లి దాచిపెడితే, తిరిగి తన వద్దకు తెచ్చే వరకు అన్నం ముట్టనని భీష్మించి, నిరాహార దీక్ష చేశాడట. అస్తంతా ఆమె పేర వ్రాసేస్తానని బెదరించాడట. చంద్రబాబు నాయుడిని విందించి, నీకు మాత్రం అక్రమ సంబంధాలు లేవా అని బెదరించాడట.

వినడానికే జుగుప్సాకరంగా వున్న ఈ బూతు కథను దక్కన్ క్రానికల్ పత్రిక సవివరంగా బయట పెట్టింది. పది రోజుల పాటు ఎన్టీ రామారావు దీనిని కనీసం ఖండించను కూడా లేదు. అబద్ధమని చెప్పలేదు. ఆ తర్వాత ఒక పూట ఆంధ్రజ్యోతికి ప్రత్యేక ఇంటర్వ్యూ ఇచ్చి, లక్ష్మి శివ పార్వతి కేవలం తన అభిమాని మాత్రమేనని వాక్రువ్వాడు.

అక్రమ సంబంధం అసత్యమైతే ఎన్టీఆర్ దాన్ని నిర్ద్వంద్వంగా ఖండించవచ్చు. కనీసం ఆ యువతి చేతనైనా ప్రకటన ఇప్పించి వుండవచ్చు. పేర్లు, వివరాలతో సహా ఒక యువతి అక్రమ సంబంధం కథను పత్రికలో వ్రాస్తే, అది నిజం కాకుంటే, ఆమె కోర్టులో సవాల్ చేసి రుజావు చేయ గల్గితే, ఆ పత్రిక మూత పడే పరిస్థితి వస్తుంది. ఎన్టీఆర్‌కు ఆ విషయం తెలిసీ, వూరకున్నాడంటే ఆయన రాసలీల నిజమే అయి వుండాలి. కోర్టుకు వెళ్తే నిజాలు బయటకు వచ్చి రాజకీయంగా పుట్టగతులు లేకుండా పోతాయని భయపడి వుండాలి.

తెలుగుదేశం ఇతర నాయకులు కూడా ఈ సంఘటనను సరిగా ఖండించకుండా, తమ నాయకుడి వ్యక్తిగత విషయాల పై విమర్శ చేస్తే, కాంగ్రెస్ నాయకుల శీలానికి సంబంధించిన సంగతులు బయట పెడతామని బెదరిస్తున్నారు. ఎన్టీఆర్ నిజంగా శీలవంతుడే నని వీరికి నమ్మకం వుంటే ఈ బ్లాక్ మెయిల్ ప్రకటన లెందుకు చేయాలి?

ఎన్టీఆర్ వంటి ప్రజా జీవితంలో వుండే నాయకుడి శీలానికి సంబంధించిన అనుమానాలను సందేహాతీతంగా నివృత్తి చేయడం అవసరం. ప్రజలను పరిపాలించాల్సిన వ్యక్తి పవిత్రుడుగా వుండలేకుంటే, ఆ పరిపాలన కూడా అంతే అధ్వాన్నంగా వుంటుంది! దబాయించి నోరు మూయించడం కాకుండా తెలుగుదేశం నా యకులు లక్ష్మి శివ పార్వతి ఎవరో, ఆమెకు ఎన్టీఆర్‌కు వున్న సంబంధమేమిటో, ఆమె తన భర్తకు ఎందుకు విడాకులిచ్చి ఎన్టీఆర్ ఇంట్లో వుంటున్నదో ప్రజలకు వివరించి చెప్పాలి.

* * *

మాగుంట సుబ్బరామ రెడ్డి గారు కోవూరు ఎన్నిక పుణ్యమా అని పలు విధాల విమర్శల తాకిడికి గురి కావడం దురదృష్టకరం. రాజకీయాలలో ఒక నూతన తరం ప్రవేశానికి నాందిగా ప్రజా జీవితంలోకి వచ్చిన వాడు సుబ్బరామ రెడ్డి గారు. గత రెండు దశాబ్దాలుగా రాజకీయాలలోకి వస్తున్న వారు, వెలుగులో వున్న వారిని చూసి, సుబ్బరామ రెడ్డి గారిని చూస్తే ఈ విషయం స్పష్టంగా అర్థమౌతుంది. అది తెలుగుదేశం కావి కాంగ్రెస్ కావి, మరొకటికి కావి – నాయకులకు రాజకీయాలే వృత్తి భృతి కూడా! గ్రామస్థాయి నుంచి ముఖ్యమంత్రి వరకు ప్రతి నాయకుడి యావ డబ్బు పైనే! ఎవరికి అలవైనంత మటుకు వాడు, ఎవరికి వీలైనంత వరకు వాడు దోచుక తినడం తప్ప మరొక ఆలోచన, కార్యక్రమం లేదు. ఆఖరకు ఎన్టీఆర్ పై కూడా ఎన్ని అవినీతి ఆరోపణలు వచ్చింది మనం చూశాం. రాజకీయాలలోకి రావడమంటే ధన సంపాదన కోసమే నన్న దృక్పథం పెరిగి పోతున్నది. బడా బడా సారా వ్యాపారులు, కాంట్రాక్టర్లు కొందరు రాక పోలేదు కాని, వారు రాజకీయాలలో డబ్బు తినకపోయినా, రాజకీయ పదవులను తమ వ్యాపారావసరాలకు వాడుకొనే నెపంతో వస్తున్నవారే! సంపాదించిన సంపదను రాజకీయాలలో కరగదియడానికి, ధారపోయడానికి వచ్చిన వాడు సుబ్బరామ రెడ్డి. స్వాతంత్ర్య పోరాటపు తరం నాటి వారివలె సేవా, త్యాగాలు లేవు కాని, నిస్వార్థ పరత్వం మాత్రం పుష్కలంగా వుంది. రాజకీయాలలో ఆయన ఆర్జించేది శూన్యం; కాజేసుకునేవి కోట్లలో వుంటుంది. రాజకీయాల ద్వారా అదనంగా వచ్చే పలుకుబడి కూడా ఏమీ లేదు. ఢిల్లీ నుండి నెల్లూరు వరకు వ్యాపార పరంగానే ఆయనకు అపారమైన పరిచయాలు, పలుకుబడి వున్నాయి.

నెల్లూరు జిల్లా నాయకులలో జనార్థన రెడ్డి తర్వాత ముఖ్యమంత్రి కాగల్గిన అవకాశం, అర్హత, అదృష్టం ఒక్క సుబ్బరామ రెడ్డికే వున్నాయన్నది నిజం. విజయభాస్కర రెడ్డి ఎంపిక సమయంలోనే ఆయన పేరు ఆపినా ఆగకుండా తోసుకొని వచ్చింది. భవిష్యత్‌లో మళ్లీ ఎప్పుడో ఒకసారి ఆ అదృష్టం వరించి తీరుతుంది కూడా!

అంతటి ఉజ్వలమైన భవిష్యత్తు, ఉదాత్తమైన దృక్పథం కల్గిన నాయకుడు తనకంటూ ఒక ప్రత్యేకమైన రాజకీయ శైలి రూపొందించు కోవడం అవసరం కాదా? అల్ప స్వల్ప విషయాల పై ఆవేశం, ఆగ్రహం ఆయన ప్రతిష్టకు తగను కాక తగవు. సుబ్బరామ రెడ్డి గారు రాజకీయాలలో రాణించాలంటే దానధర్మాలు, అడ్డు ఆపు తెలియని వాగ్దానాలు పని చేయవు. నెల్లూరు, ఒంగోలు జిల్లాల ప్రజల సమస్యల పై ప్రభుత్వ పరంగా పరిష్కారానికి ఆయన కృషి జరపాలి. తన పలుకుబడిని, నేర్పును వినియోగించి శాశ్వతంగా జిల్లాకు ఉపకరించే కృష్ణాపట్నం రేవు, సోమశిల ప్రాజెక్టు విస్తరణ, విమానాశ్రయం, నీటి పారుదల వ్యవస్థ పటిష్టత, రహదారుల అభివృద్ధి వంటి కార్యక్రమాలకు నిధులు తరలించుక రావాలి. తన సమయాన్నంతటిని ఆ కృషికి వెచ్చించాలి. స్థాయి, రాజకీయావగాహన లేని సాధారణ రాజకీయ వాదుల సాంగత్యం వీడాలి. ప్రజలతో తాను ప్రత్యక్ష సంబంధాలు పెట్టుకోవాలి. వర్గ రాజకీయాలకు దూరం కావాలి. తనకంటే పార్టీ ఎప్పుడూ పెద్దదనే స్పృహ కల్గి వుండాలి. ఆ తీరులో రాజకీయం నడిపితే ఈ జిల్లాలో సుబ్బరామ రెడ్డి గారికి ప్రత్యర్థులుండరు, విమర్శలుండవు, ప్రతిష్టకు పోటీ పడే వారుండరు. ఏ ఎన్నికలోనూ ఎదురు వుండదు.

శరద్‌పవార్ సుబ్బరామ రెడ్డి గారికి రాజకీయ గురువు. ఆయన తన బారామతి నియోజక వర్గంలో, తన స్వంత జిల్లాలో ఎంతటి ప్రజాదరణ కల్గి వుంటేది, దాన్ని ఎట్లా పెంచుకున్నది, ఎట్లా నిలుపుకున్నది అధ్యయనం చేయగల్గితే తన ప్రస్తుత రాజకీయ శైలిలోని లోటు పాట్లు తనకే అర్థమౌతాయి.

# పంచాంగము

## ముహూర్తములు

13 తేది ఆదివారము ఉదయము 7.24 గంటలకు మిధున లగ్నమున వివాహ ఉపనయన వ్యాపారారంభములకు

రాత్రి 1.14 గంటలకు మీన లగ్నమున గృహ ప్రవేశమునకు

14 తేది సోమవారము ఉ. 7.10 గంటలకు మిధున లగ్నమున గృహారంభ ఉపయన వ్యాపారారంభములకు సుముహూర్తములు కలవు.

## జూన్ నెల తిథులు

జ్యేష్ట బహుళ

తే 12 శని అష్టమి రా.గ. 11.20వ
తే 13 ఆది నవమి రా.గ. 1.26వ
తే 14 సోమ దశమి రా.గ. 3.22వ
తే 15 మంగళ ఏకాదశి రా.గ. 5.00వ
తే 16 బుధ ద్వాదశి పూర్తిగ
తే 17 గురు త్రయోదశి పూర్తిగ
తేది 18 శుక్ర త్రయోదశి ఉ.గ.6.40వ

స్వయంపాకుల శ్రీనివాసులు

## నెల్లూరులో ఎండ

| | |
|---|---|
| 6 తేది | 97.1 |
| 7 తేది | 98.8 |
| 8 తేది | 97.5 |
| 9 తేది | 100.9 |
| 10 తేది | 104.5 |

## నీటిమట్టం

| | |
|---|---|
| నెల్లూరు చెరువు | 11.2అ |
| సర్వేపల్లి రిజర్వాయరు | 1.8అ |
| కనిగిరి రిజర్వాయరు | 9.2అ |

## నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకులు | |
| 9672 (పాతవి) | 3,900/- |
| 9672 (కొత్తవి) | 3,200/- |
| 9674 (కొత్తవి) | 3,400/- |
| ఐ.ఆర్. 20 | 2,400/- |
| బియ్యం బస్తా (70 కేజీలు) | 550/- |
| బియ్యం (కేజీ) | 8/- |
| బంగారు సవర (8 గ్రా) | 3,400/- |
| వెండి (10 గ్రా) | 65/- |
| పసుపు (100 కిలోలు) | 950/- |
| వేరుశనగ నూనె (కేజీ) | 30.50/- |
| మిరపకాయలు (కేజీ) | 20/- |
| చింతపండు (కేజీ) | 21/- |
| చక్కెర (కేజీ) | 10.60/- |
| బెల్లం (కేజీ) | 15/- |
| కందిపప్పు (కేజీ) | 19/- |
| పెసర పప్పు (కేజీ) | 15/- |
| మినప పప్పు (కేజీ) | 11/- |

సినిమా

# అడవి నుంచి అన్న

"అడవుల్లో ప్రతికలేక జనారణ్యంలోకి వచ్చిన ఒక యువకుడు ప్రతి చోటా క్రూరమృగాలు ఉన్నాయని తెలుసుకుంటాడు. తన నుంచి తమ్ముడ్ని దూరం చేసిన వారి పై ప్రతీకారం తీర్చుకుంటాడు. అంతే కాక సమాజంలోని అవినీతిని అంతం చేయడానికి ప్రజల అభిమానమనే ఎ.కె. 47 ని చేతబట్టిన అన్నగా కీర్తించబడతాడు. గిరిజనుడుగా, రిక్షా కార్మికుడుగా, అన్నగా, రివెంజ్ తీసుకునే వ్యక్తిగా నాలుగు విభిన్నమైన గెటప్స్‌లో డాక్టర్ రాజశేఖర్ కనిపిస్తారు. ఈయన సరసన తొలిసారిగా గౌతమి, రోజా నటిస్తున్నారు" అన్నారు ముత్యాల సుబ్బయ్య. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో సినిమా స్కోప్‌లో పోకూరి బాబూరావు నిర్మిస్తున్న ఈతరం ఫిలింస్ "అన్న"లో గుమ్మడి, గొల్లపూడి, వేలు, బ్రహ్మానందం, ఎ.ఎల్. నారాయణ, నర్రా, దేవరాజ్, సంజీవి, నల్లూరి వెంకటేశ్వర్లు, సూర్యకాంతం, మాస్టర్ ఆదిత్య, మాస్టర్ కిరణ్ వగైరా నటవర్గం. కథ: సంజీవి, మాటలు: యం.వి.ఎస్. హరనాథ రావు, సంగీతం: కీరవాణి, సమర్పణ: పోకూరి రామారావు చివరి షెడ్యూల్ ఆగస్ట్ 1 నుంచి 20 వరకు రంపచోడవరం అడవుల్లో జరుగుతుంది.

## భాను ప్రియ సమయస్ఫూర్తి

త్వరలోనే శత చిత్రోత్సవం జరుపుకో బోతున్న భానుప్రియ మంత్రిణిగా నటించిన "కట్టలై" తమిళ చిత్రం తమిళనాడులో విజయవంతంగా ప్రదర్శింప బడుతోంది. ఈమె ఇటీవల ఎక్కడికెళ్లినా ఈమె చుట్టూ మహిళలు మూగుతున్నారట. మహిళాభ్యుదయానికి ప్రతివారూ ఏవేవో సలహాలు ఇస్తున్నారట. "ఇవన్నీ నాకు చెప్పి ప్రయోజనమేమిటి? నేను నటిని మాత్రమే; ఈ విషయాలన్నీ ప్రభుత్వానికో, రాజకీయ నేతలకో తెలియజేయండి అవి నేను ఎంత మొత్తుకున్నా వాళ్లు వింటే కదా? కొంత మంది తల్లులు వాళ్ల పిల్లలకు పేరు పెట్టమని నన్ను కోరారు. ఒక పాప కళ్లు ఎంతో విశాలంగా వున్నాయి. "కణ్ణమ్మ" అనే పేరును సూచించాను. వాళ్లందరికీ నచ్చింది. ఎంతో మురిసిపోయారు. వెళ్తూ వెళ్తూ ఒక మహిళ "ఇలా నామకరణాలు చేయడం రాజకీయ నేతల లక్షణం" అనేసి వెళ్లిపోయింది. నాలో నేను నవ్వుకున్నాను" అంది భానుప్రియ.

## రివర్స్ అయిన మెకానిక్ అల్లుడు

కథను సమకూర్చడం నుంచి చిత్రాన్ని విక్రయించే వరకు అన్ని శాఖల్లోనూ తామె నిష్ణాతుడు అనుకునే అల్లు అరవింద్ ఈ మారు భంగు తినక తప్పలేదు. అక్కినేని, చిరంజీవి, విజయశాంతి, శారద వంటి ప్రముఖ తారలు పాల్గొన్న "మెకానిక్ అల్లుడు" చిత్రం ప్రతి చోటా ప్రేక్షకులకు సరిగా లేక ఏ పాత్రా పండలేదని చాలా మంది అభిప్రాయం - పైగా. చిత్రం చివరన

సినిమా

# అమ్మోరు రీషూటింగ్

సహజకవి మల్లెమాల సుందర రామిరెడ్డి పుత్రుడు శ్యాంప్రసాద్ రెడ్డి పర్ఫెక్షనిస్టు. అందుకే నెలల పాటు చాలా భాగం షూటింగ్ జరిగిన అమ్మోరు చిత్రాన్ని పాతదర్శకుని స్థానే కొత్తగా కోడి రామకృష్ణ దర్శకత్వంలో రీ షూటింగ్ జరపడానికి నిశ్చయించారు. "అంకుశం" వంటి వీరిద్దరి సమ్మేళనంలో రూపొందిన చిత్రాలు ఎంతటి ఘన విజయాల్ని సాధించాయో అందరికీ తెలిసిందే.



బావ—బావమరిది చిత్రంలో కృష్ణంరాజు, జయసుధ

సినిమా

# ఆదర్శ దర్శకుడు

మణిరత్నంను షూటింగ్ స్పాట్‌లో చూస్తూ ఉంటే "అంజలి, రోజా, దళపతి" వంటి అద్భుతమైన చిత్రాలను డైరక్ట్ చేసింది ఈయనేనా అనే విస్మయం కల్గించేంత సింపుల్‌గా వుంటారు. "తిరుడా! తిరుడా" చిత్రం పూర్తయ్యే వరకు తదుపరి చిత్రం గురించి ఎలా ఆలోచిస్తాను" అన్నారాయన మందహాసంతో. ఆయన కళాకారుల చేత బాగా రిహార్సల్స్ చేయిస్తారు. తాను అనుకున్న ఎఫెక్ట్ వచ్చే వరకు ఓకేకు వెళ్లరు. తాను అనుకున్నట్లు ఆర్టిస్టులు చేయక పోతే ఏ మాత్రం విసుక్కోరు. తన అసిస్టెంటులను ఆప్తమిత్రుల్లా చూసుకుంటాడు. ఉదయం షూటింగ్ స్పాట్‌కు వచ్చాడంటే సాయంత్రం షూటింగ్ ముగించి పాకప్ చెప్పేవరకు కూర్చున్న చోటు నుంచి కదలరు. అంత దీక్షతో ఆయన శ్రమిస్తాడు గనుకే ఆయన రూపొందించే చిత్రాలలో క్వాలిటీ ఉంటుంది "మీ శ్రీమతి సుహాసిని ఏదైనా చిత్రానికి దర్శకత్వం వహిస్తే, అందులో మీ తోడ్పాటు ఏ మాత్రమైనా ఉంటుందా?" అంటే, మణిరత్నం నవ్వుతూ "సినిమా విషయాలలోనే కాక ఇంటి పనుల విషయంలోనూ అడపా దడపా నా తోడ్పాటు ఉంటుంది" అన్నారు.

## కొన్ని చిత్రాల పేర్లు

ఆర్.జె.ఆర్. ప్రొడక్షన్స్ "విజయ దశమి", శ్రీ కె.ఎం. ప్రొడక్షన్స్ "శ్రీ కనక మహాలక్ష్మి మహాత్మ్యం" ప్రసిద్ధి క్రియేషన్స్ "శ్రద్ధాంజలి", భారత్ అసోసియేట్స్ "శత్రువేట", ఆరోర మూవీస్ "సంకల్పం" బెలిఫోటో ఫిలిమ్స్ "ప్రతిబింబం" ఎస్.ఆర్.ఎస్. ఆర్ట్ ఫిలిమ్స్ "పోలీస్ ముట్టడి" కెయార్ ఎంటర్‌ప్రైజస్ "హరాహుహార" శ్రీ బాలాజీ ఆర్ట్ మూవీస్ "మాస్టర్ మాయగాడు", మాస్టర్ మోసగాడు, మాయదారి మోసగాడు" అభిక్రియేషన్స్ "నమోదు" శ్రీ వరలక్ష్మి సినీ ప్రొడక్షన్స్ "లక్ష్యం" తేజస్విని ప్రొడక్షన్స్: గంగా జమున.

## మద్రాసులో ఎ.ఎన్.ఆర్., ఎన్.టి.ఆర్..

చాలా కాలం తర్వాత మద్రాసులో ఎ.ఎన్.ఆర్.,ఎన్.టి.ఆర్ ఒక రోజు పాటు ఉన్నారు. జూన్ 2 న నెల్లూరీయుల 'సిటీ ఫైనాన్షియర్స్' సంస్థ ప్రారంభోత్సవానికి అక్కినేని విచ్చేయగా, బాలకృష్ణతో సింగీతం శ్రీనివాస రావు కథ, దర్శకత్వంలో చందమామ విజయా కంబైన్స్ "భైరవ ద్వీపం" జానపద చిత్రం ప్రారంభోత్సవంలో ముహూర్తపు షాట్‌కు ఎన్.టి.ఆర్. దర్శకత్వం వహించారు. ఎన్.టి.ఆర్. ఆనాడు " షావుకారు, పాతాళభైరవి" చిత్రాలతో తారాపథాన్ని అందించిన విజయవాహినీ స్టూడియోస్ పూర్వ వైభవంతో కళకళ లాడింది. "భైరవ ద్వీపం" చిత్రంలో రోజా, రంభ, సత్యనారాయణ, గిరిబాబు, శుభలేఖ సుధాకర్, వినోద్, బాబూమోహన్, హరిబాబు, ఈశ్వర బాబు, చిట్టిబాబు, గరిమెళ్ల, శ్రీ గణేష్, కె.ఆర్. విజయ, సంగీత, రాధాకుమారి, శోహని, రజిత పాత్రధారలు. మాటలు, నిర్మాణత: రావి కొండల రావు, ఛాయ: కబీర్‌లాల్, నిర్మాత: బి. వెంకట్రామ్ రెడ్డి.



పాతరాతి యుగానికి ఆడవాళ్ల ఆలోచలను తిరోగమింపజేసే

# బావ—బావమరిది

ఇప్పటికే సమాజంలోని పలు దుర్గతలతో మహిళా లోకం అణగ ద్రొక్కి బడుతున్న ఈ తరుణంలో కులాల కురుక్షేత్రం వంటి అభ్యుదయ చిత్రాన్ని తీసిన యువదర్శకుడు శరత్, మగువల ఆలోచనలను పాత రాతి యుగానికి తీసుకొని పోయేందుకు చేసిన ప్రయత్నమే బావ - బావమరిది చిత్రం. ఇందులో గ్రామ పెద్ద వేశ్య లోలుడై ఆస్తి మొత్తం ఆమెకు ధారపోస్తాడు. పవిత్రమైన దేవాలయానికి పతితను వెంట బెట్టుకొని పూజ చేయను వెళతారు. ఇదేమి చోద్యమని గ్రామస్తులు నిలదీస్తే వాళ్లను తూలనాడుతారు. బావమరిబావమరిది తనను అవమానించాడన్న ఆక్రోశంతో వితంతువుగా మారిన తరువాత వేసుకునే తెల్లని వస్త్రం వేసుకొని భార్యను ఇంట్లోకి రమ్మంటాడు. కేవలం పసుపు, కుంకుమ,





భర్త వున్నాడనే హోదా కోసం అతను ఏ బేవార్సు పనులు చేస్తున్నా భరించి భార్య పడి వుండాలన్న సందేశం నర్మ గర్భంగా ప్రేక్షకుల నెత్తిన మొత్తాడు దర్శకుడు.

ఇంతటితో సరిపెట్టేందుకు మామగారు చిత్రం తరువాత తాజాగా ఈ చిత్రాన్ని తీసిన నిర్మాత కూడా అయిన ఎడిటర్ మోహన్ వూరుకోలేదు. ఎవరో రాసిన మూలకథను తుంగలో తొక్కి, తానే స్వయంగా దాన్ని తిరగరాసి అన్ని వర్గాల ప్రేక్షకులను సంతృప్తి పరచను సాధ్యమైనంత సరసాన్ని, పచ్చి బూతులను జొప్పించారు. క్షుద్ర కాదుకు హైపెక్కించేందుకు కథానాయికకి రేచీకటుంటూ కథానాయకుడికి డాన్ ఇవ్వడం, పైట జార్చడం, లుంగి లాగడానికి తోడుగా రాయనలవి కాని ద్వంద్వార్థపు సంభాషణలు పెట్టాడు.

మధ్య వయస్కుల మనోల్లాసం కోసం ప్రముఖ వాంప్ తారను చింతామణిగా చిత్రం మొత్తం చూపించారు. ప్రేక్షకులు బూతును ఎంజాయ్ చేస్తున్నారు కాబట్టి తాము అలాంటి పాత్రలో నటిస్తున్నట్లు చెప్పిన కోట శ్రీనివాస రావు - బాబూమోహన్‌ల నాటు బూతు మాటల కోసం వారిని

కొరవ 11 వ పేజీ



## కృతజ్ఞతాంజలి

నాలుగు సంవత్సరాలుగా నెల్లూరులో వుంటూ రిటైర్ అయిన నాకు ఇంత కాలం స్నేహ హస్తాన్నందించిన బంధువులు, స్నేహితులు SBI స్టాఫ్ - Dr. S - K.S.N., K.V.R., D.G.K.M., A.P., M.S.R., V.P.R., P.M.S., K.B.L.R., N.R.M.R., B.R., R.J.M.R., J.S.R., K.S.G.H., T.V.K.R., ఇంకా ఎంద రెంద రో అంద రికి నే ను మా నమస్కారాలు ... వీడ్కోలు తీసుకొని శేష జీవితాన్ని హైదరాబాదులో గడుపుటకు వెళ్లుచున్న సందర్భంలో హృదయ పూర్వక కృతజ్ఞతాంజలి.

—పోకాల పాండురంగారావు

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్థ సంవత్సర చందా రూ. 50/-
విడిప్రతి రూ. 2/-



## ప్రకటన

ఇందు మూలముగా యావన్మందికి తెలియజేయునది ఏమనగా

నెల్లూరు తాలూకా పెదారుపల్లి గ్రామమందు ప్రస్తుత సర్వే నెం. 82 మరియు 83 రు నందు నాకు 5 యకరముల పొలము నా యొక్క సంపూర్ణ స్వాధీన హక్కు భుక్తములలో కల్గిన ఆస్థి అయి వున్నది. నా యొక్క సంపూర్ణ హక్కును హై కోర్టు ఆఫ్ ఆంధ్రప్రదేశ్ వారు W.A. 12223/86 జడ్జిమెంటును, నెల్లూరు సబార్డినేటు కోర్టులో O.S. 44/88 లో జడ్జిమెంటు లోను ఖరారు చేసి యున్నారు. కాగా నా సోదరుడు శ్రీ జె. మోహన్ రాయ్ అను వ్యక్తి, పై విషయములను మధ్య పర్చి సదరు నా యొక్క ఆస్థిని అన్యాక్రాంతము చేయుటకు ప్రయత్నము చేయు చున్నట్లు తెలియ వచ్చినది. సదరు J. మోహన్ రాయ్ గాని మరి ఏ ఇతరులకు గాని పై వుదహరించిన భూమిలో ఎట్టి హక్కును లేదు అన్ని సదరు ఆస్తి నా సంపూర్ణ హక్కు భుక్తములలో వున్నది అన్ని యావన్మంది తెలుసుకోవలెను.

ఇందుకు భిన్నముగా సదరు ఆస్తి గూర్చి ఎవరు ఎట్టి లావా దేవీలు జరిపించిన అవి నన్ను బెందు చెయ్యవు అని చెల్లవు అని గుర్తించ వలెను.

**ఎన్. రాజ్ కుమారి పద్మిని దేవి**
హక్కుదారు

## In the Court of the Subordinate Judge

Madanapalle (A.P)
S.C. 27 /1991
E.A. 318-92 ; E.A. 16/93

సూరే శ్రీ హర్ష -డిక్రీ హోల్డరు
1. బూశెట్టి గుండాలయ్య (died)
2. పి. సుబ్బమ్మ, 3. నాగరంజని
4. పి. శివ -జడ్జిమెంటు డెటార్స్

### నోటీసు

పై దావాలో E.A. 318/82 లో 1వ జడ్జిమెంటు డెట్టార్ చనిపోయిన దాని వలన 2 to 4 జడ్జి మెంటు డెట్టార్స్‌ను వార్సులుగా చేర్చుగోరి E.A. 16/93 లో 4 వ జడ్జిమెంటు డెట్టార్, మైనర్‌గా యుండేటందుకు Minority Guardianగా 1వ Judgement debtor ను నియమ్మించగోరి డిక్రీ హోల్డరు పిటీషను దాఖలచేసి యుండేటందున 2 to 4 జడ్జిమెంటు debtors 28.6.93 వ తేది పై కోర్టులో ఉదయం 10.30 గంటలకు హాజరై చెప్పుకో వలయును. లేనంతట ఎక్స్‌పార్టీగా తీర్మానించ బడును.

**C. Thimma Reddy**
Advocate for Decree Holder




పాటూరు ఉచిత వైద్యశిబిరం సభలో సిటిజన్స్ క్లబ్ ప్రాజెక్ట్ డైరెక్టర్ ఉదయభాస్కర్, అధ్యక్షుడు బి. వెంకటేశ్వర రావు, సామంతు రఘురామ రెడ్డి, డాక్టర్ జయచంద్ర

# నెల్లూరు సంగతులు

( 4 పేజి తరువ )

### కంచి స్వామి జయంత్యుత్సవం

కంచి స్వామి పరమాచార్య శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామి శత జయంత్యుత్సవాలు ఘనంగా జరిపించేందుకు 5 తేది సన్నాహక కమిటీ ఆంధ్ర సభలో సమావేశమయ్యింది. ఈ నెల 26 తేది జరిగే ఈ వుత్సవంలో జయేంద్ర సరస్వతి స్వామి, విజయేంద్ర సరస్వతి స్వామి, పుష్పగిరి శంకరాచార్యులు వస్తున్నారు; వుదయం 8 గంటలకు స్టోన్‌హౌస్‌పేట లోని కన్యాకాపరమేశ్వరి ఆలయం వద్ద నుండి టౌన్‌హాలు వరకు వూరేగింపు నిర్వహిస్తారు. 26, 27, 28 తేదిలలో పరమాచార్యుల వారి ఆయురారోగ్యాల అభివృద్ధి కోసం ఆయుష్య హోమం జరుగుతుంది. కంచి పీఠం పూజలందుకొంటున్న లలితా త్రిపుర సుందరి, చంద్రమౌళీశ్వరుల పూజా కార్యక్రమాలు కూడ జరుగుతాయి. శ్రీ చింతా శ్రీరామమూర్తి, శ్రీసర్వేపల్లి జగన్నాథం జయంత్యుత్సవ కార్యక్రమాలు నిర్వహిస్తారు.

### ఎస్.ఎస్.సి. పరీక్ష ఫీజు

సెప్టెంబరు, అక్టోబరు నెలల్లో జరిగే ఎస్.ఎస్.సి. సప్లిమెంటరీ పరీక్షలకు ఫీజు చెల్లించే గడువు ఈ నెల 16 తేది వరకు పొడిగించారు. ఈ గడువు మొదట 10 తేది వరకని గతంలో ప్రకటించడం జరిగింది. మూడు రూపాయల అపరాధ రుసంతో 24 తేది, ముప్పై రూపాయలతో జూలై 5 తేది లోగా ప్రధానోపాధ్యాయులకు చెల్లించాలి. పాఠశాలలో చదవకుండా మొదటి సారిగా పదో తరగతి పరీక్షలకు హాజరు కాదలచిన ప్రైవేటు విద్యార్థులు ఈ సదవకాశాన్ని వినియోగించు కోవచ్చని జిల్లా విద్యాశాఖాధికారి తెలుపుతున్నారు.

### సారా నిషేధంపై వ్యాసరచన పోటీలు

సామాజిక రుగ్మతలను అంతమొందించడం- సారా నిషేధంలో స్వచ్ఛంద సంస్థల పాత్ర అనే రెండు అంశాలపై రాష్ట్ర స్థాయిలో వ్యాసరచన పోటీలను 'హెల్ప్' స్వచ్ఛంద సేవా సంస్థ నిర్వహిస్తుంది. ఆసక్తిగలవారు వ్యాసాలను ఈ నెల 25 తేది లోపు కో-ఆర్డినేటర్, హెల్ప్, 31/255, బాలాజీ నగర్, నెల్లూరు -2 అనే అడ్రస్ కు పంపాలి. విజేతలకు ప్రథమ బహుమతి 1116/-, ద్వితీయ బహుమతిగా 558 రూపాయలతోపాటు రెండు కన్సొలేషన్ బహుమతులిస్తామని నిర్వాహకులు చెబుతున్నారు.

### ఎస్.ఎస్.సి. పరీక్ష ఫీజు

సెప్టెంబరు, అక్టోబరు నెలల్లో జరిగే ఎస్.ఎస్.సి. సప్లిమెంటరీ పరీక్షలకు ఫీజు చెల్లించే గడువు ఈ నెల 16 తేది వరకు పొడిగించారు. ఈ గడువు మొదట 10 తేది వరకని గతంలో ప్రకటించడం జరిగింది. మూడు రూపాయల అపరాధ రుసంతో 24 తేది, ముప్పై రూపాయలతో జూలై 5 తేది లోగా ప్రధానోపాధ్యాయులకు చెల్లించాలి. పాఠశాలలో చదవకుండా మొదటి సారిగా పదో తరగతి పరీక్షలకు హాజరు కాదలచిన ప్రైవేటు విద్యార్థులు ఈ సదవకాశాన్ని వినియోగించు కోవచ్చని జిల్లా విద్యాశాఖాధికారి తెలుపుతున్నారు.

### సెవెన్త్ తప్పిన వారికి తిరిగి పరీక్షలు

1993 ఏప్రెల్ నెలలో జరిగిన ఏడవ తరగతి కామన్ పరీక్షల్లో తప్పినవారు , పరీక్షలకు హాజరు కాని విద్యార్థులకు తిరిగి పరీక్షలు నిర్వహిస్తున్నట్లు జిల్లా విద్యాశాఖాధి కారి శ్రీఎన్. శ్రీరామమూర్తి చెప్పారు. ఈ పరీక్షలు జూన్ 28 నుండి జూలై 8 వరకు జరుగుతాయి. సకాలంలో ఫీజు కట్టలేని వారు లేటు ఫీజు కలిపి కట్టి ప్రధానోపాధ్యాయుని ద్వారా జిల్లా విద్యాశాఖాధికారికి పంపుకోవాలి.

### 21న బి.ఎస్.ఎఫ్ జవాన్ల ఎంపిక

సరిహద్దు రక్షణ దళంలో కానిస్టేబుళ్ల ఎంపిక ఈ నెల 21 తేది నెల్లూరులో జరుగుతుంది. జిల్లా నుండి 50 మంది అభ్యర్థులను ఎంపిక చేస్తారు. 12 పోస్టులు రిజర్వేషన్ కోటాలో భర్తీ చేస్తారు. అభ్యర్థులు 167.5 సెంటిమీటర్ల ఎత్తు, 49 కిలోల బరువు, 80 సెంటీ మీటర్ల ఛాతి, 18 నుండి 22 సంవత్సరాల మధ్య వయస్సుతో పాటు పదవ తరగతి పాసై వుండాలి. గిరిజన అభ్యర్థులకు మినహాయింపు వుంటుంది. ఆరున్నర నిముషంలో ఒక మైలు పరుగెత్తడంతో పాటు, 4 అడుగుల ఎత్తు, 12 అడుగుల దూరం దూక గలిగి వుండాలి. చదువుకు సంబంధించిన సర్టిఫికెట్లు, కుల ధృవీకరణ పత్రాలు, 5 ఫోటోలు అభ్యర్థులు తీసుక రావాలి. వున్నతాధికారుల ఆదేశాల లభించిన తరువాత ఎంపిక స్థలం ప్రకటిస్తారని జిల్లా పౌరసంబంధ శాఖాధికారి కార్యాలయం తెలిపింది.

## జనవాణి

(3 పేజి తరువ)

దూరదర్శన్‌లో ప్రసారమైన టెలీప్లే ఖడ్గ తిక్కన చాలా ఆకట్టుకొంది. గ్రిద్దలూరు గోపాల రావు రచనా మత్కారం బాగుంటే, వెంకురెడ్డి పద్యాలు నెల్లూరు సీమ ప్రతిష్టను దాటాయి. కవి తిక్కన పాత్రధారి విగ్రహం బాగుంది. ఖడ్గ తిక్కన శ్రీమతి, తల్లిగా నటించిన మహిళలు ఫరవాలేదనిపించారు. పొన్నాల వారి పద్యాలు బాగున్నా రికార్డింగు, షూటింగు లోపభూయిష్టంగా తయారయ్యాయి.

విశాఖపట్నం —చిత్రకవి ఆత్రేయ

### దిగ్భ్రాంత్రులను చేసిన బాబా పై హత్యాయత్నం

ప్రశాంత వాతావరణానికి, ఆధ్యాత్మిక సాధనకు, దీనజనోద్ధరణకు అణువణువు అంకితమైన పరమ పవిత్రమైన పుణ్యక్షేత్రం పుట్టపర్తి. లోక కళ్యాణార్థం దివి నుండి భువికి దిగిన అవతార పురుషుడని యావత్ ప్రపంచంచే కీర్తింపబడుతున్న అమృత మూర్తి శ్రీ సత్య సాయిబాబా పై హత్యా యత్నం దిగ్భ్రాంతులను చేసింది. మానవత్వపు విలువల మహామనిషి. ఆధ్యాత్మిక మహిమాన్విత శక్తి పై దాడికి ఏ శక్తులు పూనుకొన్నాయో అర్థం కావడం లేదు. అలనాటి ప్రవక్తలు మహమ్మద్, జీసస్‌క్రీస్తులు మంచి చెప్పినందుకు ఎన్నో కష్టాలనుభవించారు. మానవ శ్రేయస్సుకు 'సమిధ' లా నిలిచిన మహా వ్యక్తి పై దాడికి బాబా లోని అపూర్వ దైవశక్తి అడ్డు నిలిచింది పాపాత్ముల పాపపు కార్యాలు త్వరలో బట్టబయలు కాక తప్పవు

నెల్లూరు—భట్టారం పట్టాభిరామయ్య

### కాంగ్రెస్ నాయకులు ఆలోచించండి

స్వాతంత్ర్య సమరంలో కాంగ్రెస్ పార్టీ తరపున ఎన్నో త్యాగాలు చేసిన మహానుభావులు చాలా మంది నెల్లూరు జిల్లా వారే. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత జిల్లా, రాష్ట్ర దేశ స్థాయిల్లో అనేక రాజకీయ పదవులు పొంది అన్ని రంగాలలో కాంగ్రెస్ పార్టీ ఆశయాలను అమలు పరచి గౌరవ ప్రతిష్టలు తెచ్చిన చాలా మంది జిల్లా వాళ్లున్నారు. మన నాయకులకు ఈనాటి, దేశ రాజకీయాల్లో ప్రత్యేక స్థానం వుంది. ఈ విషయాన్ని నాయకులు దృష్టిలో వుంచుకొని హుందాగా ప్రవర్తించి చిన్న చిన్న విషయాలను విస్మరించి పార్టీ అభివృద్ధికి పాటు పడతారని నా ఆశ.

నెల్లూరు —వొమ్మిన సుబ్రహ్మణ్యం

### ఈ విషయం ప్రస్తావించి వుంటే బావుండేది

మే 21 తేది 'జమీన్‌రైతు' సంచికలో సూళ్లూరుపేట సబ్ రిజిస్ట్రారు ఆఫీసులోని అవినీతి విషయమై వార్త వ్రాసినందుకు కృతజ్ఞతలు. కాని సబ్ రిజిస్ట్రార్ పేరు చెప్పి పెద్ద, పెద్ద మొత్తాలను స్వాహా చేసే స్వాములను మీరు మరచి పోయారు —చెట్లకు గబ్బిలాల మాదిరి ప్రతి ఆఫీసు వద్ద బ్రోకరు, దస్తావేజుల లేఖర్లు వుంటారు. ఆఫీసు పనిమీద ఎవరైనా వస్తే లోపల ఆఫీసర్ పేరు చెప్పి నిలువు దోపిడి చేస్తారు. స్టాంపులు, వ్రాత, లంచం కూలి మొత్తం ఇంత అని దండు కొంటారు తప్ప ఎవర్నీ ఆఫీసులోకి అడుగు పెట్టనివ్వరు. బహుశా వీరి వ్యాపారం లోకూడా లోపలి అధికార్లకు లాలూచీ తప్పక వుంటుంది.

నాయుడుపేట — జీ. వెంకటేశ్వర్లు

### రోడ్డు ఇన్వెస్టిగేషన్ డివిజన్ తరలించకండి

బైపాస్ రోడ్డు, పెన్నా నదిపై రెండవ బ్రిడ్జికి సంబంధించిన ప్రాథమిక కార్యాచరణ పథకం తయారీకి మార్గం సుగమం చేసేందుకు నెల్లూరులో 1987 సంవత్సరం రోడ్డు ఇన్వెస్టిగేషన్ డివిజన్ కార్యాలయం ప్రారంభించారు. ప్రస్తుతం బైపాస్ రోడ్డులోని పలు కాల్వలపై బ్రిడ్జిల పని చురుకుగా జరుగుతున్న తరుణంలో ఈ కార్యాలయాన్ని కడప పట్టణానికి తరలించాలనే ప్రయత్నం చేయడం అన్యాయం. తరలింపుకు చిత్తూరు—కర్నూల్ జాతీయ రహదారిని కారణంగా చూపుతున్నారు. చేపట్టిన పథకాలు పూర్తి కాకుండానే ఆఫీసును తరలించడం అన్యాయం. ఈ విషయంలో జిల్లా మంత్రి, నెల్లూరు శాసనసభ్యుడు చొరవ చూపి అడ్డు కట్టవేయ గలరని ఆశ.

నెల్లూరు —ఇ.వి.ఎస్. నాయుడు

### నెల్లూరు వీరత్వానికి ప్రతీక ఖడ్గ తిక్కన

గత ఆదివారం టి.వి.లో ప్రసారమైన ఖడ్గ తిక్కన సింగిల్ ఎపిసోడ్ సింహపురి గతకాలపు వీరత్వాన్ని మరోసారి ఆవిష్కరించింది. నటీ నటులంతా చక్కగా నటించారు. శ్రీ గోపాల రావు చక్కని సమీక్షలు రాయడమే కాదు దర్శకునిగా కూడా సత్తా వున్న వారని స్పష్టమైంది. మంచి నాటికను ప్రసారం చేసి నందుకు దూరదర్శన్‌కు కృతజ్ఞతలు. 'జమీన్‌రైతు' పత్రికలో ప్రచురించిన ప్రివ్యూ ఫోటోలో పాత్రలు - పాత్రధారుల పేర్లు ప్రకటించి వుంటె బావుండేది.

— దోగిపర్తి సత్యనారాయణ

అల్లూరు —కనుమూరు శ్రీ హరిరెడ్డి

### ఆత్మ విమర్శ చేసుకోండి

కోవూరు వుప ఎన్నిక కాంగ్రెస్ వారులందరికీ ఒక గుణ పాఠం కావాలి. పాణ్యం ఎన్నిక సమయంలో తెలుగుదేశం కార్యకర్తలకు మంచినీళ్లు పుట్టకుండా చేసింది కాంగ్రెస్ ప్రభుత్వం. అయినా తెలుగుదేశానికి 30 వేలకు పైగా ఓట్లు వచ్చాయి. ఇన్ని ఓట్లు ఎందుకొచ్చాయని ఆత్మ విమర్శ చేసుకోవాల్సింది పోయి గెలుపు చూసుకొని ఆనందించారు. ఇప్పుడు కోవూరు, కైకలూరు కూడా పోయాయి! ఎందుకని?

కాంగ్రెస్ ప్రభుత్వంలోని వ్యక్తులను ప్రజలు ఏమనుకొంటున్నారు. వీళ్లు ఎలా ప్రవర్తిస్తున్నారనేది ఆత్మ విమర్శ చేసుకోవాలి. లేకుంటె రెండోసారి విజయభాస్కర రెడ్డి గారి తన చేతుల మీదుగా అధికారం తెలుగుదేశానికి అప్పచెప్పక తప్పదేమో!

నెల్లూరు — ఎ.వి. సుబ్బారావు

శ్రీనివాస ఎంటర్‌ప్రైజెస్ కి.వి.శేషయ్య కుమారుడు ప్రసాద్, పూర్ణిమల వివాహం ఇటీవలం జరిగింది.

## పెండ్లిండ్లు

( 2 పేజీ కొరవ )

ఆధునిక యువతి సుభాషిణి బి.ఎస్‌సి. బిఇఎల్; కావలూరు, స్వర్గీయ కలివేటి రాజయ్య కుమారుడు సంజీవి బిటెక్ వివాహం 12 తేది ప్రాతఃకాలంలో కస్తూరి బా కళాక్షేత్రంలో కిటకిట లాడే జన సమ్మర్దంతో, ఆర్భాటంగా జరిగింది. అనేకు మంది మంత్రులు, పిసిసి అధ్యక్షుడు, మాజీ ముఖ్యమంత్రి శ్రీ జనార్ధన రెడ్డి లతో పాటు జిల్లాలోని అధికార అనధికార ప్రముఖులందరూ ఒక్కరు తప్పిపోకుండా ప్రెజెంట్ వేసుకున్నారు.

* * *

శ్రీ దేవిరెడ్డి రామచంద్రా రెడ్డి మనుమరాలు, అంటే డాక్టర్ డి. శ్రీనివాసులు రెడ్డి కుమార్తె వందన; హైదరాబాదు శ్రీ కె. వీరా రెడ్డి కుమారుడు స్వరూప్ కళ్యాణం 14 తేది కస్తూరి దేవి విద్యాలయంలో వైభవంగా జరిగింది.

* * *

సూళ్లూరు పేట పేరున్న కాంగ్రెస్ వాది, పేరు చాలని న్యాయవాది జిల్లా గ్రంధాలయ సంస్థ అధ్యక్షుడు, రిజర్వేషన్ ఆటంకంతో పదవీ వైరాగ్యమును ధరిస్తున్న బద్దెపూడి వేణుగోపాల రెడ్డి కుమార్తె రూప; శ్రీ బి. వెంకట కృష్ణారెడ్డి కుమారుడు మహేష్‌ల పెండ్లి 15 తేది టిటిడిలో జరిగింది.

* * *

పెండ్లిండ్ల పార్టీలకు సామాన్లు సరఫరా చేయడంలో నెల్లూరులో అందరికంటే ఫస్ట్‌గేడ్ పొందిన శ్రీనివాస హైరర్స్ యజమాని శ్రీ పసుమర్తి వెంకట శేషయ్య కుమారుడు ప్రసాద్ యం.కాం., (బి.ఎల్.) నెల్లూరు, సంజూరు నమశ్శివయ్య కుమార్తె పూర్ణిమల పెండ్లి 15 తేది పాండురంగ అన్నదాన సమాజంలో ఘనంగా జరిగింది.

* * *

మనుబోలు మాజీ కరణం, పేరూరు ప్రస్తుత పిఎల, పొట్టివారైనా పట్టెడు తెలివి కల్గిన దండిగుంట రమణయ్య కుమార్తె అన్నపూర్ణ; సత్యవేడు, కలిమిలి బి సుధాకర రావు కుమారుడు మురళిల కళ్యాణం 15 తేది గూడూరు డిఎస్ఆర్ కమ్యూనిటి హాలులో జరిగింది.

* * *

మాజీ ఈనాడు రిపోర్టరు విలేఖరి శ్రీ సలీం బేగ్ కుమార్తె సహన, శ్రీహరికోట షార్ కేంద్రం ఉద్యోగి ఎస్.ఎం.కె. బాష కుమారుడు, ఉద్యోగార్థం దుబాయిలో వున్న ఎస్.ఎం. రఫీల నిక్కా 16 తేది ఎన్‌జిఒ హోంలో జరిగింది.

* * *

హెచ్ఎంటి గడియారాల డీలరు, సినిమా యాక్టర్ కాలేక పోయినా సినిమా నటులను మించి మేకప్ వేసుకుని ఎప్పుడూ తళతళలాడుతూ కన్పించే మదీనా వాచ్ కంపెనీ యజమాని షేక్ ఇస్మాయిల్ కుమార్తె అఫ్సర్ ఖాను, అబ్దుల్ బషీర్ బి.ఇ.ల కళ్యాణం కస్తూరిబా కళాక్షేత్రంలో ఆర్భాటంగా జరిగింది.

* * *

నెల్లూరు విద్యుత్ శాఖ చీఫ్ ఇంజనీరు, ప్రమోషన్ల విచ్చేనలు ఎన్ని ఎక్కినా నిరాడంబరత్వం, నిజాయితీ విడిచి పెట్టని సౌమ్యుడు, ఈనాటి పరిస్థితులలో సర్దుక పోలేక వాదస్తుడిగా మాత్రం గౌరవ మందుకొనే మంచి అధికారి శ్రీ శివుని గురుమూర్తి రెడ్డి కుమారుడు వినోద్ రెడ్డి బి.టెక్; కావమంచి శ్రీ సి.హెచ్. వెంకట కృష్ణారెడ్డి కుమార్తె కుసుమల వివాహం 23 తేది టిటిడిలో జరిగింది.

* * *

చవటపాళెం గ్రామ కక్షలలో దశాబ్దాల పాటు పోరాడి, అలసి పోయి, ప్రశాంతంగా కాలం గడుపుతున్న కటారు చెంచు కృష్ణయ్యనాయుడు మనుమరాలు, కసుమూరు శ్రీ కుడితిపూడి మోహనరావు కుమార్తె సునీత; ఆదూరు పల్లి, స్వర్గీయ అత్తులూరు అచ్చపనాయుడు కుమారుడు బాబు వివాహం 23 తేది కస్తూరి దేవి విద్యాలయంలో జరిగింది.

## సినిమా

( 9 పేజి కొరవ )

"ఇది చిరంజీవి చిత్రం వంటి కార్డ్ చూపించడం అక్కినేని అభిమానులకు బాధకల్గించిందట. ఏవేవో అట్టహాసాలతో, ఆర్భాటంగా ప్రేక్షకులను ఆకర్షించవం ఇక కల్ల అని ఇటీవల విడుదలయ్యే భారీ చిత్రాలు నిరూపిస్తూనే వున్నాయి. అంచేత సర్వజ్ఞులమనుకునే వారు తమ అహంను కాస్త పక్కన బెట్టి దీక్షతో చిత్రాలు నిర్మిస్తేనే గాని అటువైన చిత్రాలు జనాకర్షణకు నోచుకోవు అని మెకానిక్ అల్లుడు నిరూపించింది.

## చిత్రసమీక్ష

(9వ పేజీకొరవ)

వరిదాపులు ప్రతి సీన్‌లో కనపడేట్లుగా కథను మలిచారు. కొత్త బిచ్చగాడు పొద్దెరగతన్నట్లు సరికొత్త మాటల రచయిత కలం నగ్నంగా నర్తించిదంటే అతిశయోక్తి కాదు. అందుకే ప్రతి పాత్ర నోట పరిధి హద్దులు దాటిన మాటలకు సెన్సార్ కత్తిరింపులు పర్నా సందర్భోచిత మంటూ తప్పించుకున్న పలు మాటలు వినాల్సి వస్తుంది. మహిళా సెంటిమెంట్లు, అక్కా తమ్ముళ్ల అనురాగాలు, వసంతైన పాటలు, శ్రావ్యమైన సంగీతం, భారీ నట సంగమంతో ప్రేక్షకులను కొద్దో గొప్పో ఆకర్షిస్తుంది చిత్రం.

కథలోకి వెళితే ఒకప్పటి జమీందారు వంశానికి చెందిన రాఘవ రావు (కృష్ణంరాజు) ఆస్తి తగాదా విషయమై కోర్టుకు పోతూ దేవాలయానికి వచ్చిన సమయంలో కడు పేదరాలైన జానకి (జయసుధ) పాడిన విజయ గీతిక విని ముగ్ధులై పోతారు. కోర్టు కేసు గెల్చిన ఆనందంలో జానకిని అదృష్టంగా భావించి సహృదయంతో పెళ్లి చేసుకొంటాడు. భర్త అనుమతితో తన ఆరవ ప్రాణమైన తమ్ముడు రాజా (సుమన్)ను కూడా అత్తవారింటికి తీసుక పోతుంది. రాజాకు అక్కా బావంటే పంచ ప్రాణాలు. 'బావ చెప్తే సరే' అని ఏ పనైనా చేస్తుంటాడు. పట్న వాసం నుంచి చదువు ముగించుకొని వచ్చిన మరదలు గీతను (మాలశ్రీ) తొలుత ప్రేమించను నిరాకరించినా తరువాత గ్రీన్ సిగ్నల్ ఇస్తాడు రాజా. ఇంతలో ఆ గ్రామంలో వ్యభిచారపు సంత పెట్టను వచ్చిన వేశ్య చింతామణి (సిల్క్‌స్మిత) వుచ్చులో పెద్ద మనిషి రాఘవ రావు ఇరుక్కుంటాడు. ఆమెను దేవాలయానికి పూజ చేయను తీసుకొని బావ రావడాన్ని చూసిన బావమర్ది రాజా సహించలేక బావ పై తిరగ బడతాడు. దీనితో ఆగ్రహించిన రాఘవ రావు అతన్ని ఇంటి నుంచి తరిమి వేస్తాడు. అక్క మరదలు బావకి మద్దతు పలకడంతో ఆవేదనతో కృంగిపోతాడు రాజా.

తన అక్క కాపురం సరిదిద్దను బ్రోతల్ యాక్టు ప్రకారం చింతామణిని అరెస్ట్ చేయించాలన్న రాజా ప్లాన్ బెడిసికొట్టి బావ రాఘవ రావు ఆమెకు తాళి కట్టడంతో ఖంగుతింటాడు. ఆస్తి మొత్తం చింతామణి తమ్ముడు రాఘవ రావు చేత రాయించుకొని ఆయనను కట్టు బట్టలతో ఇంట్లో నుండి తరిమివేసి నప్పుడు తన ఇంటికి ఆప్యాయతగా తీసుకెళ్లిన బావమర్ది మనసును తెలుసుకొంటాడు బావ. ఇంతలో చింతామణిని ఆమె తమ్ముడే హత్య చేయడం, దాన్ని రాఘవ రావు చేసాడని పోలీసులు అరెస్ట్ చేయడం, అక్క కాపురం కోసం బావమర్ది నేరాన్ని తన నెత్తిన వేసుకోవడం, జానకి ద్వారా అసలు విషయం తెలుసుకొని బావ మరదులు కలిసి విలన్లను పట్ పట్ లాడించడంతో కథ చివరకు సుఖాంతంగా ముగుస్తుంది.

చిత్రంలో రాయుడు (కోట శ్రీనివాస రావు) పిల్ల జమీందార్ (బాబూమోహన్) పాత్రలు కథాను క్రమంలో కలిసి పోయాయి. వీరిద్దరూ చింతామణి పొందు కోసం పరితపించే సీనులో పాటే సర్వం పోగొట్టుకొని ఇల్లు పూడ్చడం, గడ్డి వాము వద్ద కలలు గనడం, పురికి సిద్ధం చేసుకొనే సిన్లు నవ్వు తెప్పించినా, శృతి మించిన మాటల వల్ల ఎబ్బెట్టుగా అనిపిస్తాయి. మరదలి వ్యాధి నయం కావడం కోసం బావ చేతుల్లో కర్పూరం పెట్టుకొని మోకాళ్ల పై దేవాలయం మెట్లు ఎక్కే సీన్ బాగుంది. ప్రత్యేకంగా భీముడు (ఎద్దు) చేసే విన్యాసాలు మాస్ ప్రేక్షకులను ఆకట్టుకొంటాయి. రాఘవ రావుగా కృష్ణంరాజు హుందాగా పాత్ర పోషించారు. యాక్షన్ పాత్రలకే పరిమితమైన హీరో సుమన్ సరికొత్త బావమర్ది పాత్రలో రాణించారు. అక్క పాత్ర నిడివి తగ్గడంతో జయసుధ విశ్వరూపం కనపడలేదు. మాలశ్రీని పాటలు, సెక్స్ అప్పీల్ కోసం పెట్టినా ఆమె ప్రమేయం లేకుండా పెరిగి పోయి వున్న శరీరాన్ని ఇప్పుడు సర్దుకొని చూసినా, ఒక సంవత్సరం తరువాత చూడలేము. పి.ఎల్. నారాయణ, నిర్మల పాత్రోచితంగా నటించారు. ప్రత్యేకంగా చింతామణి పాత్ర పోషించిన సిల్క్ స్మితను చెప్పుకోవాలి. వాంప్ డాన్స్‌లోనే కాదు సరియైన పాత్రలను కూడా పోషించ గలనని నిరూపించింది.

బావలు సయ్యా – మరదలు సయ్యా పాటతో పాటు మిగతావి బాగున్నాయి. రాజ్–కోటి సంగీతం వీటికి ప్రాణం పోసింది. డి.[illegible] బాబు, కళల నృత్య వి[illegible] యువతను ఆకట్టుకొంటాయి. బూతు మాటలు రాయడంలో ఇప్పుడున్న రచయిత లందరినీ మించి పోయాడు కొత్త మాటల రచయిత రాజేంద్ర కుమార్.

## జిల్లావార్తలు

( 2 పేజి కొరవ )

### నాయి బ్రాహ్మణ విద్యార్థులకు ఆర్థిక సహాయం

ఈ సంవత్సరం మార్చి నెలలో జరిగిన పదవ తరగతి కామన్ పరీక్షల్లో ఎక్కువ మార్కులు వచ్చిన పేద నాయి బ్రాహ్మణ విద్యార్థినీ, విద్యార్థులకు జిల్లా నాయి బ్రహ్మణ చైతన్య సంఘం ఆర్థిక సహాయం అందిస్తుంది. ఆసక్తి గల వారు మార్కుల లిస్ట్ జెరాక్స్ కాపీ, ఎమ్మార్వో ధృవీకరించిన కులం, ఆదాయపు సర్టిఫికెటు జతపరచి జూన్ 20 తేదిలోగా డాక్టర్ సూర్యనారాయణ, గిరిజన స్టోర్స్ వద్ద, సాయిరాం వీధి, పొదలకూరు రోడ్డు, నెల్లూరు -3, అనే చిరునామాకు పంపాలని సంఘం ప్రచార కార్యదర్శి జి. రఘు తెలుపుతున్నారు.

## వై.ఎస్.

మొదటి పేజీ కొరవ

వై.ఎస్. హార్డ్‌కోర్ మాజీమంత్రి డి.ఎల్. రవీంద్రా రెడ్డి విషయంలో ఇంకా మంతనాలు జరుగుతున్నాయి. రవీంద్రా రెడ్డి విషయంలో వ్యతిరేకత వున్నందున కొట్ల వెనక్కు తగ్గుతున్నట్లు అభిజ్ఞ వర్గాల భోగట్టా.

ఇలా వుండగా ప్రాంతీయ పార్టీకి స్వస్తి చెప్పినప్పటికీ ప్రజా సమస్యల పరిష్కారానికి ప్రభుత్వం పై పోరాటం జరిపే విషయంలో రాజీ లేదని వై.ఎస్. ప్రకటించారు. రాను రాను కాంగ్రెస్ పార్టీ పట్ల ఆదరణ తగ్గుతున్నదని వై.ఎస్. ఆందోళన వ్యక్తం చేయడం వెనుక అంతర్యం అంతు బట్టక ముఖ్యమంత్రి వర్గీయులు తలలు పట్టుకుంటున్నారు. మంత్రి వర్గంలో తన వారికి స్థానం దొరికే వరకు వై.ఎస్. ఈ విధంగానే వ్యవహరిస్తారని, ఆ తర్వాత సర్దుకుంటారని ముఖ్యమంత్రి వర్గీయులు ఆశిస్తున్నారు.

## దేశం

మొదటి పేజీ కొరవ

ఎదురు దాడికి దిగారు. "మా పార్టీ నాయకుడి పై వ్యక్తిగత ఆరోపణలకు దిగితే, దిగజారిన కాంగ్రెస్ నేతల చరిత్రలు బట్టబయలు చేస్తామంటూ" తెలుగుదేశం నాయకులు హెచ్చరించారు. ప్రధాని పి.వి. నరసింహా రావు, ముఖ్యమంత్రి కోట్ల విజయ భాస్కర రెడ్డి వ్యక్తిగత జీవితాలతో సహా పలువురు కాంగ్రెస్ నాయకుల శీలాన్ని ఉతికి ఆరేస్తామని వారు బెదరించారు. కాంగ్రెస్ నేతలను ఒకప్పుడు పచ్చి వ్యభిచారులుగా, దగాకోరులుగా విమర్శించిన ఎన్టీఆర్ సరిగ్గా అటువంటి ఆరోపణలకే గురి కావటం తెలుగుదేశం నాయకులకు మింగుడు పడక పోయినా, తమ నాయకుడ్ని ఎలాగో ఒకలాగ రక్షించు కోవాలన్న తాపత్రయం తెలుగుదేశం వారిలో కనిపిస్తోంది. తెలుగుదేశం ఎదురుదాడిలో కాంగ్రెస్ అగ్రనేతల గుట్టు రట్టు చేస్తామన్న బెదరింపు సహజంగానే కాంగ్రెస్ నాయకుల వెన్నులో వణుకు పుట్టించింది. దీనితో ఎన్టీఆర్ పై అటువంటి ఆరోపణలకు తాత్కాలికంగా స్వస్తి చెప్పాలని కాంగ్రెస్ నిర్ణయించు కున్నట్లుంది.

ఇలా వుండగా శివ పార్వతితో తన సాన్నిహిత్యం పై రామారావు తెలివిగా పెదవి విప్పారు. "దేవుడి పై నింద వేస్తే ఆ దేవుడే దిగి వచ్చి ఆరోపణలకు జవాబు చెబుతాడా?" అని ఎన్టీఆర్ ఎదురు ప్రశ్న వేశారు. ఆ స్థాయికి దిగజారి నేను సమాధానం చెప్పలేను అంటూ తన పై ఆరోపణలకు ప్రజలే సమాధానం చెబుతారని, ప్రజలే తన దేవుళ్లని, ఈ వివాదాన్ని వాళ్ల నిర్ణయానికే వదిలేస్తున్నానని రామారావు తప్పదాటు వేశారు. కాంగ్రెస్ సంస్కృతి, కాంగ్రెస్ నైతిక స్థాయి గురించి ఏ ఒక్కరికీ సదభిప్రాయం లేక పోవచ్చు. కానీ తాను దేవుడినని, ప్రజల సంక్షేమం కోసమే కోట్లు సంపాదించే వృత్తిని వదులుకొని రాజకీయాల్లోకి వచ్చానని చెప్పుకునే ఎన్టీఆర్ నైతిక స్థాయి నేడు నడిబజారులో చర్చకు రావడంతో తెలుగుదేశం నాయకులు జుత్తు పీక్కుంటున్నారు. తెలుగుదేశంలో ఇటువంటి వికార కాలుష్యం తమ అధినాయకుడి తోనే శ్రీకారం చుట్టుకోవడం తెలుగుదేశం వారిని ఇబ్బందుల్లో పడవేసింది.



# రావూస్ విద్యాసంస్థలు

ఫోన్: 363, వెంకటాచలం
~ లెక్చరర్ ~
ఆఫీసు: 26046, 23781

## కోచింగ్ సెంటర్

వి.ఆర్.సి. ఎదురుగా, చాకలి వీధి, నెల్లూరు-1.

**గత 10 సంవత్సరాలుగా అత్యుత్తమ ఫలితాలందిస్తున్న విద్యాసంస్థ**

### సీనియర్ ఇంటర్

**M.P.C. & Bi.P.C.** (T.M. & E.M.)

క్లాసులు జరుగుచున్నవి. రెండవ బ్యాచ్ జూన్ 9 నుండి ప్రారంభమైనవి.

### జూనియర్ ఇంటర్

M.P.C. & Bi.P.C. (T.M. & E.M.) అడ్మిషన్లు జరుగుచున్నవి. క్లాసులు జూన్ 9 నుండి ప్రారంభమైనవి

గత సంవత్సరాల వలనే ప్రతి సబ్జెక్టులోనూ కనీసం 25 యూనిట్ పరీక్షలు నిర్వహించబడును. సీనియర్ ఇంటర్ సిలబస్ సెప్టెంబర్ ఆఖరుకు పూర్తి చేసి అక్టోబర్ నుండి EAMCET కోచింగ్ ఇవ్వబడును.

NOTE : ముందుగానే అడ్మిషన్ తీసుకొని స్టడీ మెటీరియల్ పొందవచ్చును.

## రెసిడెన్షియల్ హైస్కూల్

## రెసిడెన్షియల్ కాలేజి

G.N.T. రోడ్డు, బుజబుజ నెల్లూరు, చెముడుగుంట పోస్ట్, (బాలాజీ స్టీల్స్ సమీపంలో)

గత పది సంవత్సరాలుగా అఖండ ఫలితాలను సాధిస్తూ అజేయంగా అడుగులు ముందుకు వేస్తోంది రావూస్ సంస్థ. ఇప్పుడు ప్రారంభిస్తోన్న 'రావూస్ రెసిడెన్షియల్ హైస్కూల్' విద్యా లోకంలో సరిక్రొత్త సూర్యోదయం.

1983 లో ఆరంభించిన 'రావూస్ కోచింగ్ సెంటర్' అనేక అనూహ్యమైన విద్యార్థుల విజయాలతో విజయ దుంధుభి మోగించింది. 1992లో బుజ బుజ నెల్లూరులో 'రావూస్ జూనియర్ కాలేజ్' గా రూపుదిద్దుకుని, తన స్థాయిని మరింతగా పెంచుకుంది. అదే ఉత్సాహంతో ఇప్పుడు కొత్తగా ఈ హైస్కూలుకు అంకురార్పణ చలికింది. విద్యార్థులు ప్రతిభా వంతులు కావాలంటే హైస్కూల్ స్థాయిలోనే బలమైన పునాదులు పడాలి. ఆ సదుద్దేశ్యంతోనే ఈ హైస్కూలు రూపకల్పన చేసుకుంది.

స్పేస్ టెక్నాలజీతో 21-వ శతాబ్దంలోకి అడుగు పెట్టబోతున్న బాల మేధవులకు స్వాగతం. స్టేట్ సిలబస్‌తో 6,7,8,9 మరియు 10వ తరగతులకు ఇంగ్లీషు మరియు తెలుగు మీడియంలలో అడ్మిషన్లు మే-1 తేది నుండి ప్రారంభం.



### మా ప్రత్యేకతలు

1. తక్కువ మంది విద్యార్థులు - ఎక్కువ శ్రద్ధ
2. వ్యక్తిగత పర్యవేక్షణ - క్రమ శిక్షణ
3. శుచి, శుభ్రత - రుచికరమైన భోజన సదుపాయం
4. స్వతంత్ర ఆలోచనా ధోరణికి ప్రోత్సాహం.
5. జనరల్ నాలెడ్జ్- స్పీడ్ టెస్ట్స్ - ఐ.క్యు టెస్ట్స్
6. ప్రతిభా వంతులైన విద్యార్థులకు ఫీజుల్లో రాయితీలు
7. స్కాలర్ షిప్ సదుపాయం
8. అనుభవజ్ఞుల బోధనం
9. పరిశుభ్ర పరిసరాలు వసతి
10. డేస్ స్కాలర్స్‌కు బస్ సౌకర్యం.

అప్లికేషన్ మరియు ప్రాస్పెక్టస్‌లకు రూ.25/- M.O. & D.D. పంపి ఆఫీసునుండి పొందవచ్చును.

**రావూస్ కోచింగ్ సెంటర్**

17/584, రజక వీధి, నెల్లూరు -1,

(ఫోన్స్ : 26046, 23781)

**అత్యుత్తమ శిక్షణ**
**అపూర్వ ఫలితాలు**
**ఆధునిక వసతులు**

జూనియర్ ఇంటర్ : M.P. & Bi.P. (T.M. & E.M.) లకు అడ్మిషన్లు ప్రారంభమైనవి. రూ.30/- M.O./D.D. పంపి అప్లికేషను, ప్రాస్పెక్టస్ పొందవచ్చును.

సీనియర్ ఇంటర్ : క్లాసులు జూన్14 నుండి ప్రారంభం.

Note : ఇతర కాలేజీలలో జూనియర్ ఇంటర్ చదివి సీనియర్ ఇంటర్ మా కాలేజీలో చేరుటకు ప్రవేశము కలదు.

సెమిరెసిడెన్షియల్ ఫీజు Exemption తో సహా రూ. 3,500/- మాత్రమే

ఫీజు వివరములు : ఇంటర్, ఎంసెట్- మెటీరియల్‌తో సహా శిక్షణ, వసతి భోజనము పర్యవేక్షణలతో మొత్తం ఫీజు కేవలం రూ.15,000/- మాత్రమే. ఫీజు 3 వాయిదాలలో చెల్లించవచ్చును.

మెరిట్ విద్యార్థులకు రాయితీలు : 10వ తరగతిలో స్టేట్ ర్యాంకులో 10 లోపు ర్యాంకు పొందిన వారికి శిక్షణ, భోజనం, వసతి ఉచితం.
500మార్కులు సాధించిన విద్యార్థులకు రూ.2000/-.
450 మార్కులు సాధించిన వారికి రూ.1,500/-
400 మార్కులు సాధించిన వారికి రూ.1000/-
ఫీజులో మినహాయింపులు ఉంటాయి



Edited, Printed and Published by N Dolendra Prasad at Zamin Ryot Press, Nellore. OFFSET Printing at Nayagara Paper Products (India) Limited.